# నావికుడు సింద్‌బాద్

హారూన్ అల్‌రషీద్ ఖలీఫాగా ఉండే కాలంలో బగ్దాద్ నగరంలో సింద్‌బాద్ అనే పేదవాడు ఒక డుండేవాడు. వాడు బరువులు మోసి, ఆ కూలి డబ్బులతో తన పొట్ట నింపుకుంటూ ఉండేవాడు. ఒకనాడు వాడు మండుటెండలో పెద్ద బరువు ఎత్తుకుని ఒక ధనికుడి ఇంటి సమీపానికి వచ్చాడు. ఆ ఇంటిముందు చక్కగా ఊడ్చి పన్నీరు చల్లటంచేత అక్కడ చల్లగా, సుఖంగా ఉన్నది. మార్గస్థులు విశ్రాంతి తీసుకోటానికని ఇంటి బయట ఒక బల్ల వేసి ఉన్నది. అందుచేత సింద్‌బాద్ తన బరువు కింద దింపుకుని, బల్లమీద చతికిలబడి, సువాసనతో కూడిన చల్లగాలి అనుభవించ సాగాడు. వాడికి లోపలినుంచి చక్కని జంత్రగాత్ర సంగీతమూ, కోయిలలూ, చిలుకలూ, గోరువంకలూ మొదలైన పక్షుల అరుపులూ వినవచ్చాయి. కూలిచేసుకునే సింద్‌బాద్ పరమానందంచెంది వాకిలిగుండా లోపలికి తొంగి చూశాడు. లోపల మనోహరమైన ఉద్యానవనం ఉన్నది. అందులో అనేకమంది బానిసలూ, నౌకర్లూ, అతిథులూ కనిపించారు.

ప్రస్తావన

CHITRA

అంతేకాదు, రకరకాల వంటకాల వాసనలూ, పానీయాల వాసనలూ సింద్‌బాద్ వద్దకు గాలివెంట వచ్చాయి. అటువంటి భూలోక స్వర్గాన్ని వాడెన్నడూ కలలోకూడా ఊహించివుండలేదు. శరీరశ్రమ చేసి ఏది దొరికినా తిని సంతోషించే ఆ సింద్‌బాద్‌కు ఆ ఆవరణలో వాళ్ళంతా దేవతలుగా తోచారు. వాడు నిట్టూర్చి "ఓ అల్లా! నీ కరుణామృతం ఎవరిపై ప్రవహిస్తుందో ఈ అల్పుడికెట్లా తెలుస్తుంది? ఈ ఇల్లు గల పెద్దమనిషికి ఇంత సుఖమైన భోజనమూ, పానీయాలూ, సమస్త వైభోగాలూ సమకూర్చి, నన్ను ఏమీ లేని దౌర్భాగ్యుడుగా ఉంచావు!" అని అల్లాకు విన్నవించుకున్నాడు. తరవాత వాడు తన దారిద్ర్యంగురించి అప్పటికప్పుడు పాటలు కట్టి, గొంతెత్తి పాడసాగాడు.

వాడు అట్లా కాస్సేపు పాడిన తరవాత బల్లమీదినుంచి లేచి బరువు మళ్ళీ ఎత్తుకోబోతూండగా, వాకిలివద్దకు ఒక బానిస వచ్చి వాడితో, "యజమాని నిన్ను లోపలికి రమ్మంటున్నారు. నావెంట రా!" అన్నాడు. బరువులు మోసేవాడికి భయంవేసింది. వాడు ఏవిధంగానైనా లోపలికి వెళ్ళకుండా తప్పించుకుందామని ఏవో సాకులు చెప్పాడు గాని, లాభం లేకపోయింది. చివరకు వాడు



తన బరువును వాకిలివద్ద కావలిఉండే వాడికి వప్పగించి, భయపడుతూ బానిస వెంట లోపలికి వెళ్లాడు.

భవనం లోపలిభాగం భూలోక వైకుంఠంగా ఉంది. ఇంటినిండా గొప్పగొప్ప వాళ్లంతా ఆతిథ్యం స్వీకరిస్తున్నారు. ఎక్కడ చూసినా అందమైన పువ్వులున్నాయి. రకరకాల అత్తర్లు ఘుమాయిస్తున్నాయి. బల్లల మీద కనీవినీ ఎరగని వంటకాలన్నీ వడ్డించి ఉన్నాయి. అతిథులందరిమధ్యా ఒక వృద్ధుడు తెల్లని గడ్డంతో, ఠీవిగా కూచుని ఉన్నాడు. ఆయన ముఖం చాలా అందంగా కళగలిగి ఉన్నది.

బరువులు మోసేవాడు తన కళ్లను తానే నమ్మలేక, "నేను కలగంటున్నానే, లేక ఇది ఇంద్రలోకమో!" అనుకుంటూ అందరికీ సలాములు చేసి, మర్యాదగా చేతులు కట్టుకుని తల వంచుకుని నిలబడ్డాడు. వృద్ధుడు అతన్ని ఆదరంతో తనదగ్గిరికి వచ్చి కూచోమన్నాడు. అతనిముందు ఆహార పదార్థాలు తెచ్చి పెట్టారు. అతను భోజనం ముగించి చెయ్యి కడుక్కున్నదాకా వృద్ధుడు ఒక్క ప్రశ్నకూడా వెయ్యలేదు. తరవాత ఆయన, "నాయనా, నువ్విప్పుడు నా అతిథివి. బిడియపడక ఈపూటకు నీయిష్టంవచ్చినట్టు ఆనందించు. నీపేరేమిటి?" అని అడిగాడు.



"బాబూ, నేను కొద్ది కూలీకి ఘనమైన బరువులు మోస్తూంటాను. నన్ను సింద్‌బాద్ అని పిలుస్తారు!" అన్నాడు బరువులు మోసేవాడు వినయంగా.

వృద్ధుడు నవ్వి, "నాపేరుకూడా సింద్‌బాదేసుమా—నావికుడు సింద్‌బాద్...నిన్ను పిలిపించటానికి కారణమేమంటే నువ్వింతకుపూర్వం పాడిన చక్కని పాటలు. వాటిని మళ్ళీ వినాలనివుంది," అన్నాడు.

బరువులు మోసేవాడు సిగ్గుపడుతూ, "బాబూ, నేను పేదవాణ్ణి, మొరటువాణ్ణి. అందుచేత అలాటి పాటలు పాడాను. దుఃఖం నాచేత అటువంటి పాటలు పాడించింది. తమరు నన్ను క్షమించాలి!" అన్నాడు.

"నువ్వా పాటలకు సిగ్గు చెందవలసిన పని ఏమాత్రమూ లేదు. నువు నా సోదరుడి వంటివాడివి. ఆ పాటలు నా చెవులకు చాలా ఆనందం కలిగించాయి. వాటిని మరొకసారి దయచేసి పాడు!" అన్నాడు నావికుడు సింద్‌బాద్. బరువులు మోసేవాడు గొంతెత్తి పాడాడు.

తరవాత వృద్ధుడిలా అన్నాడు: "నాది కూడా అతి విచిత్రమైన కథే. దానిని నీకు చెబుతాను. నేనీస్థితికి రావటానికి పూర్వం చాలా బాధలు పడ్డాను. ఆ సంగతి నా కథ వింటే నీకే తెలుస్తుంది. నమ్మశక్యంకాని శ్రమలు పడి, ప్రమాదాల నెదుర్కొని, దురదృష్టాలపాలై, యాతనలను అనుభవించి సంపాదించిన డబ్బుతో ఈ ముసలితనంలో సుఖపడుతున్నాను. నేను ఏడుసార్లు సముద్రాలపై ప్రయాణాలుచేశాను. ఆ సముద్రయానాలలో నాకు జరిగిన అనుభవాలు విన్నవాళ్ళు నిర్ఘాంత పోతారు. కాని అలా జరగాలని రాసిపెట్టి ఉండటంచేతనే అవి జరిగాయి. విధిలిఖితం జరిగే తీరుతుంది."

తరవాత నావికుడు సింద్‌బాద్ బరువులు మోసేవాడికీ తన మిగిలిన అతిథులకూ తన అనుభవాలను ఈ విధంగా చెప్పసాగాడు:





# నావికుడు సింద్‌బాద్

నా తండ్రి గొప్ప వర్తకుడు. పాత్రులైన పేదలకు ఆయన దానధర్మాలు చేసేవాడు. చనిపోయేనాటికి ఆయనకు అంతులేని ధనమూ, భూములూ, గ్రామాలూ ఉండేవి. నాకు యుక్తవయసు రాగానే ఈ సంపదకు నేనే యజమాని నయాను. నేను నా వయసువారిని కొందరిని చేరదీసి తిండీ, తాగుడూ, దుస్తులూ మొదలైన వాటికింద విచక్షణలేకుండా చిత్తం వచ్చినట్టు ఖర్చుచేసి, మహారాజవైభవం వెలగబెట్టాను. నాకు గల ఆస్తి ఎన్నటికీ తరగదని నా భ్రమ. ఒకానొకనాటికి నాకళ్ళు విచ్చుకున్నాయి; ఎందుకంటె, నాకుండిన దంతా దాదాపు అయిపోయింది! వార్ధక్యంలో దారిద్ర్యంవాత పడవలిసి వస్తుందికాబోలు నని నేను భయపడ్డాను. "చచ్చిన సింహంకంటె బతికున్న కుక్క నయం; దారిద్ర్యంకంటె మరణం నయం," అని నాతండ్రి ఎప్పుడూ అంటూండేవాడు. ఆ మాటలు నాకు జ్ఞాపకం వచ్చాయి.

అందుచేత నాకింకా మిగిలి ఉన్నదంతా తెగనమ్మి మూడువేల వెండి దిరహములు నగదు సమకూర్చుకున్నాను. ఈ డబ్బుతో సంచారం చెయ్యాలని

మొదటి సముద్రయానం

CHITRA

నా ఉద్దేశం. ఎంతలోతుకు పోతే అంత మంచి ముత్యాలు దొరుకుతాయి అనే సామెత ఉన్నదిగదా. ఈ డబ్బుతో రకరకాల సరుకులు కొని, బాగ్దాదునుంచి బయలుదేరే ఒక వర్తకనౌకలో నేనుకూడా ఎక్కాను. ఆ నౌకలో నాతోపాటు ఇంకా అనేకమంది వర్తకులున్నారు. నౌక నదివాలున బస్రాకు పోతున్నది.

బస్రానుంచి మేము సముద్రయానం సాగించాం. దారిలో ఎన్నో దీవులు తగిలాయి, ఎన్నో రేవులు తగిలాయి. ప్రతిచోటా సరుకు అమ్మాం, ఇతర సరుకులతో మారకం వేసుకున్నాం.

అనేక వారాలపాటు మాకు భూమి పొడ కనిపించకుండా ప్రయాణం చేశాక ఒక అందమైన దీవి కళ్లబడింది. అది పచ్చగా మరకతంలాగా కంటిని ఆకర్షించింది. సరంగు పడవను ఆ దీవివద్దకు చేర్చి లంగరు దింపించాడు. తాళ్లనిచ్చెనలమీద ప్రయాణీకులం నేలమీదికి దిగాం.

మా వర్తకులందరివద్దా ఆహారమూ, వంటపాత్రలూ ఉన్నాయి. కొందరు నిప్పు చేసి వంట ప్రారంభించారు. కొందరు తమ బట్టలు ఉతుక్కున్నారు. కొందరు పచార్లు చేశారు, మరికొందరు విశ్రాంతి తీసుకున్నారు. నేనుమటుకు ఆహారం ఏర్పాట్లు






చేసుకోవటమే గాక, అక్కడి వింతవృక్షాల మధ్యగా నడిచి ఆనందించాను.

ఈ విధంగా మేమందరమూ ఎవరి పనులలో వారు నిమగ్నులమై ఉన్న తరుణంలో ఉన్నట్టుండి ఆ దీవి, ఈ చివరనుంచి ఆ చివరకు, ఒక్కసారిగా కంపించింది. ఎక్కడివాళ్ళ మక్కడ నేలమీద కూలిపోయాం. మేము దిగ్భ్రాంతులమై పడిపోయిఉన్న సమయంలో సరంగు పడవలోనుంచి కనిపించి, వెర్రిగా చేతులూపుతూ భయంతో గూడిన కంఠంతో, "అపాయం! ప్రాణాలు రక్షించుకోండి! అది దీవి కాదు, బ్రహ్మాండమైన తిమింగలం! అది అనాదిగా సముద్రంలో ఉండటంచేత దాని వీపున ఇసుక పేరి అందులో చెట్లు మొలిచాయి! మీరు మంటలుచేసి దాన్ని రెచ్చగొట్టారు. అది కదులుతున్నది. వచ్చెయ్యండి! లేకపోతే అది నీటిలో మునిగి మిమ్మల్నికూడా ముంచెయ్యగలదు!" అని అరిచాడు.

ఈ మాటలు విన్న వర్తకులు తమ బట్టలనూ, గిన్నెలనూ, ఇతర సామగ్రినీ వదిలేసి పడవవేపు పరిగెత్తారు. పడవ లంగరు ఎత్తుతున్నారు. అది కదిలింది. కొందరు పడవను అందుకోగలిగారు, మరికొందరు అందుకోలేక పోయారు. ఇంతలో తిమింగలం నీటిలో మునగనే మునిగింది. పడవ అందుకోలేక దాని వీపుమీద దిగబడిపోయిన వారంతా సముద్రంపాత పడ్డారు.

సముద్రంపాత పడినవారిలో నేనుకూడా ఒకణ్ణి. కాని అల్లా అనుగ్రహంచేత ఒక కొయ్యతొట్టి నావేపు కొట్టుకువచ్చింది. అందులో ఎవరో వర్తకులు బట్టలు ఝాడించుకున్నారు. ఆ తొట్టి నన్ను సముద్రంలో మునగకుండా కాపాడింది. ప్రాణంమీది తీపికొద్దీ నేను దాన్ని పట్టుకుని అసాధారణమైన యత్నంచేసి దానిమీదికి ఎక్కి కూచున్నాను. కూచోటానికి పట్టు కుదిరాక నేను నా కాళ్లను తెడ్లలాగా





ఉపయోగిస్తూ ముందుకు పోగలిగాను. కాని అలలు తొట్టిని ఈ పక్కకూ, ఆ పక్కకూ వంచుతూనే ఉన్నాయి.

ఈలోపల పడవ తెరచాపలన్నీ ఎత్తారు. అది వాయువేగాన వెళ్లిపోతున్నది. నేను నా శక్తికొద్దీ కాళ్లతో నీటిని తోస్తూ దాని వేపు వెళ్ళాను. కాని అది కొద్దిసేపటిలో చూపుమేరలో లేకుండా వెళ్లిపోయింది. ఇంతలో చీకటికూడా పడింది. నేను చచ్చానే అనుకున్నాను. ఆ రాత్రల్లా, మర్నాడల్లా సముద్రుడితో ఘర్షణ పడగా చివరకు గాలీ, అలలూ కలిసి నన్ను ఒక దీవి తీరానికి తెచ్చి పడేశాయి. ఆ తీరం వెంబడి కొండలు నిటారుగా లేచిఉన్నాయి. అయితే కొండపై నుంచి కిందికి ఏవో లతలు దిగి సముద్రం లోకికూడా పాకుతున్నాయి. నా చేతుల లోనూ, కాళ్ళలోనూ ఉన్న బలాన్నంతా వినియోగించి, అమానుషమైన ప్రయత్నంతో ఆ లతలను పట్టుకుని క్రమంగా పైనున్న ప్రదేశానికి ఎగబాకాను.

ఇప్పటికి ఒక ఒడ్డు చేరాను గనక నా స్థితి ఎలా ఉన్నదీ తెలుసుకోగలిగాను. నా వంటినిండా గాయాలూ, కదుములూనూ. సముద్రంలో చేపలు నాపాదాలను పూర్తిగా కొరికేశాయి. అపాయంమూలానా, డస్సి



పోయిఉండటంవల్లా, నాకిబాధ లేపీ ఇంత వరకు స్ఫురించలేదు. కాని ఇప్పుడు బాధతో పడిపోయాను. స్పృహ లేకుండాపోయింది!

ఆ రోజల్లా నా ఒళ్ళు నాకు తెలీదు. మర్నాడు ఎండ నా ముఖంమీద పడి మెళు కువ వచ్చింది. నేను లేవటానికి ప్రయత్నిం చాను గాని, నా పాదాలు ఏమాత్రమూ స్వాధీనంలో లేవు, నేను కింద పడిపోయాను. నా స్థితి వర్ణనాతీతం. అయినప్పటికీ అట్లాగే మోకాళ్లమీదా చేతులమీదా పాకుతూ, నడుస్తూ ఒక సమప్రదేశం చేరుకున్నాను. అక్కడ ఫలవృక్షాలున్నాయి, మంచినీటి సెలయేళ్ళున్నాయి.





వాటితో కడుపు నింపుకుంటూ అక్కడే చాలా రోజులు విశ్రాంతి తీసుకుని మెల్లిగా బలం చేకూర్చుకున్నాను. నా శరీరబాధలు క్రమంగా తగ్గసాగాయి. అటూ ఇటూ తిరగ టానికిగాను రెండు చంక కర్రలు తయారు చేసుకున్నాను. వీటి సహాయంతో చెట్లమధ్య తిరుగుతూ, పళ్లు తింటూ, ఆలోచిస్తూ, అల్లా మహిమకు ఆనందిస్తూ కాలక్షేపం చేశాను.

ఒకనాడు నేను తీరం వెంబడి నడు స్తూండగా అంతదూరాన నాకేదో జంతువు లాగా కనిపించింది. నేను అత్యాశ్చర్యంతో దానివేపు వెళ్లి అది కట్టేసిఉన్న గుర్రమని తెలుసుకున్నాను. అది మామూలు గుర్రాల లాగా లేదు, చాలా గొప్పజాతిదిగా ఉన్నది. దగ్గిరికి వెళ్లి దానిమీద ఎక్కాలనిపించింది నాకు. కాని నేనింకా దూరంలో ఉండగానే ఎవరో వ్యక్తి భూమిలోనుంచి లేచినట్టు లేచి నావేపు వస్తూ, "ఎవరు నువ్వు? ఎక్క ణ్ణుంచి వచ్చావు? ఇక్కడికి రావటానికి ఎందుకు సాహసించావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను సముద్రయానం చేస్తూ మరికొందరితో సహా సముద్రంలో పడి పోయాను. అల్లా నా ప్రాణం కాపాడి మీ దేశంలో తెచ్చి పడేశాడు," అన్నాను.

"నావెంట రా," అంటూ ఆ మనిషి నా చెయ్యి పట్టుకుని భూమి అడుగున ఉండే



ఒక గుహలోకి తీసుకుపోయాడు. లోపల విశాలమైన సావడిలాగా ఉంది. నన్నా మనిషి ఒక గౌరవనీయమైన స్థానంలో కూచోబెట్టి, నాకు భోజనంపెట్టాడు. నా కడుపు నిండాక అయన నాకథ అడిగాడు. నేను చెప్పిన కథ యావత్తూ శ్రద్ధగా విని చాలా ఆశ్చర్యపోయాడు.

"నా కథ చెప్పాను. దయచేసి మీకథ కూడా చెబుతారా?" అని అడిగాను. అయన ఈవిధంగా చెప్పాడు:

"ఈ దీవిలో నాలాటివాళ్ళం చాలా మందిమి అక్కడక్కడా ఉన్నాం. మీర్జాన్ మహారాజుకు గుర్రాలు సంపాదించి పెట్టటమే మాపని. ప్రతి అమావాస్యనాడూ సముద్రంలోనుంచి ఉత్తమాశ్వాలు తీరానికి మెయ్యటానికి వస్తాయి. వాటిని పట్టుకోవటం మాపని. నిన్ను మీర్జాన్‌మహారాజుదగ్గిరికి తీసుకుపోతాను. మనం కలుసుకోవటం మంచిదయింది. లేకపోతే నీవీ ద్వీపంమీద నిష్కారణంగా చచ్చిపోయేవాడివి."

ఇంతలో మిగిలిన కాపావాళ్ళుకూడా అక్కడికి వచ్చారు. నన్ను ఒక గుర్రం మీద ఎక్కించారు. అందరమూ కలిసి మీర్జాన్‌మహారాజు భవనానికి వెళ్ళాం. కాపావాళ్ళు ముందుగా రాజుకు నన్ను








గురించి చెప్పారు. తరవాత నేనాయన దర్శనం చేసుకున్నాను. నాకాయన ఆదరంతో స్వాగతమిచ్చి నానోటనే నాకథ అంతా విన్నాడు. చివరకాయన, "నాయనా, నీ ఆయుర్దాయం చాలా గట్టిది. లేకపోతే ఇన్ని ఇక్కట్లు గడిచి ప్రాణాలతో బయటపడవు," అన్నాడు. ఆయన నన్ను తన ఆప్తులలో ఒకణ్ణిగా చేసుకుని, రేవులూ, నౌకావ్యవహారాలూ చూసే పదవిలో నన్ను మంచి జీవితంమీద నియమించాడు.

నా ఉద్యోగంలో తగినంత తీరిక ఉండేది. అందుచేత నేను రాజును రోజూ కలుసుకో గలిగేవాణ్ణి. ఆయన నన్ను తన ఆప్తులలోకెల్లా అగ్రగణ్యుడుగా చూసుకుంటూ, రోజూ ఏదో ఒక బహుమానం ఇస్తూవచ్చాడు. చివరకు నన్ను సంప్రతించకుండా ఆయన ఏ రాచకార్యమూ చేయని పరిస్థితి ఏర్పడింది.

ఇక్కడ నాకింత సుఖంగా జరుగుతున్నప్పటికీ నేను నా దేశాన్నిగురించి ఆలోచించటం మానలేదు. అక్కడికి తిరిగి పోగలుగుతానన్న ఆశకూడా నన్ను వదలలేదు. "బాగ్దాదు నగరం ఏదిక్కుగా ఉన్నది?" అని నేను ఎందరో నావికులను అడిగిచూశాను. కాని ఒక్కరూ చెప్పలేక పోయారు. వారికసలు ఆ నగరం పేరైనా తెలీదు. అందుచేత, కాలం గడుస్తున్నకొద్దీ నాలో స్వదేశానికి తిరిగిపోవాలన్న ఆరాటం జాస్తి కాసాగింది; తిరిగిపోలేనన్న భయం కూడా తలఎత్తింది.

ఒకనాడు నేను సముద్రతీరాన రేవులో నిలబడి, ఉద్యోగరీత్యా పడవలకోసం చూస్తూండగా, ఒక పెద్ద పడవ రేవు చేరింది. పడవ లంగరు దించి, తాటినిచ్చెన కింద పడవేయగానే నేను పడవమీదికి ఎక్కి సరంగును కలుసుకుని సరుకులు తనిఖీ చేశాను. నా ఎదటనే నావికులు వాటిని బయట పెడుతుంటే నేను జాబితా రాసు







ఉన్నాను. అంతా అయాక, "పడవలో ఇంకేమీ సరుకు లేదా?" అని సరంగు నడిగాను. "ఉన్నది, బాబూ! అది విక్రయానికి కాదు. అందుచేత అడుగున వేసి ఉంచాను. ఆ సరుకు గల మనిషి సముద్ర మధ్యంలో మునిగిపోయాడు. అవకాశం దొరకగానే దాన్ని అతని బంధువుల పరం చేస్తాను. వారు బాగ్దాదునగరంలో ఉంటారు," అన్నాడు సరంగు.

నా గుండె అతివేగంగా కొట్టుకోసాగింది. "అయ్యా, ఆ మునిగిపోయిన మనిషి పేరేమిటి?" అని సరంగును అడిగాను. "నావికుడు సింద్‌బాద్," అని ఆయన జవాబుచెప్పాడు.

నేనా మనిషికేసి పరీక్షగా చూసి, లోగడ మమ్మల్ని నడిసముద్రంలో వదిలి పడవను తీసుకుపోయిన మనిషి యితడేనని వెంటనే గుర్తించాను.

"నేనే నావికుడు సింద్‌బాద్‌ను!" అని ఒక్క కేకపెట్టాను. తరవాత ఆయనతో నా అనుభవాలు ఉన్నవి ఉన్నట్టు చెప్పేశాను. కాని ఆ సరంగు నా మాటలు నమ్మక, "ఎంత మోసం! ఎంత ఘోరం! నావికుడు సింద్‌బాద్ సముద్రంలో మునిగిపోవటం మేమంతా కళ్ళారా చూస్తిమిగదా, నువ్వే అతనంటావే? అలా అబద్ధమాడటానికి సిగ్గులేదూ?" అని అడిగాడు.

"అబద్ధం ఆడవలసిన గతి నాకేమిటి? నేనే నావికుడు సింద్‌బాద్‌నని నీకు రుజువు చేస్తాను, చూడు," అంటూ, ఆ తిమింగిలాన్ని భూమి అనుకుని మేము దానిమీద దిగిననాటి వివరాలన్నీ చెప్పాను. చివరకు సరంగు నమ్మక తప్పిందికాదు. ఆయన పడవలో ఉన్న ఇతర వర్తకుల నందరినీ పిలిచి నా విచిత్ర కథ వారికి చెప్పి, నన్ను పరిచయంచేశాడు. నేను చచ్చి బతికి నందుకు అభినందిస్తూ, వారు అల్లా మహిమను ప్రశంసించారు.





తరవాత సరంగు నా సరుకంతా నాపరం చేశాడు. నేను ప్రతి మూటమీదా వేసిన పేళ్లు సరిచూసుకుని, నా సామానులో కొన్ని అమూల్యమైన వస్తువులను మిర్జాన్ మహా రాజుకు బహూకరించటానికి ఉంచి, మిగి లిన సరుకంతా బజారుకు పట్టించుకుపోయి అమ్మేశాను. ఈ అమ్మకంమీద నాకు ఒకటికి నూరింతలు లాభం వచ్చింది.

రాజు ఈ సంగతంతా వినగానే చాలా సంతోషించాడు. ఆయనకు నేనంటే అంత ఇష్టం. నే నిచ్చిన బహుమానాలకు ఎన్నో రెట్లు విలవైనవి ఆయన నాకు ఎదురిచ్చాడు. వీటన్నిటినీ నేను అప్పటికప్పుడే అమ్మేసి నగదుగా మార్చుకుని ఆ డబ్బంతా పడవ లోకి చేర్పించాను. తరవాత ప్రయాణ సన్నాహాలు పూర్తిచేసుకుని, ఆఖరుసారి రాజుగారిని కలుసుకుని, ఆయన నాకు చూపిన దయకు కృతజ్ఞత తెలుపుకున్నాను. నేను వెళ్ళిపోతున్నానని ఆయన చాలా విచారించాడు. ఆయన ఈసారి నాకు అనేకరకాల అత్తరులూ, మంచిగంధం చెక్కలూ, హరతికర్పూరమూ, సాంబ్రాణీ మొదలైనవి బహూకరించాడు. అవి ఆ దీవిలో పుష్కలంగా దొరుకుతాయి. వాటి నన్నిటినీ పడవలోకి పట్టించి ఎక్కాను.

అల్లా దయవల్ల గాలి అనుకూలంగా వీచింది. చాలా రోజులు ప్రయాణించేసి బస్రామీదుగా నా జన్మస్థలమైన బాగ్దాదు నగరం చేరుకున్నాను. అదృష్టవశాత్తూ నా అప్తులందరూ ఆరోగ్యంగా ఉన్నారు. నేను సంపాదించుకు వచ్చిన ధనంతో అనేక భవనాలూ, బానిసలూ, దాసదాసీ జనమూ, పొలాలూ, ఇతర అస్తులూ కొన్నాను. మా తండ్రి పోయేనాటికి నాకుండిన ఆస్తిని మించి కొనగలిగాను. తరవాత సమస్త భోగాలూ అనుభవిస్తూ నా తొలి ప్రయా ణంలో పడిన ఇక్కట్లనన్నిటినీ సులువుగా మరిచిపో గలిగాను. (ఇంకా వుంది)



# నావికుడు సింద్‌బాద్

నేను సాటిలేని భోగాలలో మునిగి తేలుతున్నప్పటికి, కొంతకాలానికి నాకు ప్రపంచపు మారుమూలలూ, కొత్త కొత్త దీవులూ చూడాలన్న కోరిక కలగసాగింది. వర్తకంమీదకూడా ఆసక్తి కలిగింది. నేను బజారుకు వెళ్లి వర్తకానికి పనికివచ్చే సామగ్రి కొని, మూటలు కట్టించి రేవుకు పట్టించుకువెళ్ళాను. త్వరలోనే ఒక ముచ్చటైన నౌక రేవులోకి వచ్చింది. సముద్రప్రయాణానికి కావలిసిన హంగులన్నీ ఆ నౌకలో అమరి ఉన్నాయి. దాని తెరచాపలుకూడా ఎంతో అందంగా ఉన్నాయి. ఈ నౌకను చూడగానే నాకు చాలా ముచ్చటవేసి నా సరుకంతా అందులోకి ఎక్కించాను. ఆ నౌకలోనే నే నెరిగిన వర్తక స్నేహితులు కొందరు ప్రయాణం చేస్తున్నారు. వారితో కలిసి ప్రయాణం చేయటం నాకు సంతోషం కలిగించింది.

ఆ రోజే నౌక లంగరు ఎత్తి కదిలింది. అది సముద్రంమీద చాలా వేగంగా సాగింది. మేము అనేక వారాలపాటు సముద్రయానం చేసి అనేక దీవులలో ఆగాం. అక్కడి అధికారుల పరిచయం చేసుకున్నాం. అక్కడి వర్తకులకు మా సరుకులు అమ్మాం,

రెండవ సముద్రయానం

CHITRA





వీలయితే వారి సరుకులతో మారకం వేసుకున్నాం. చివరకు మా నౌక ఒక దీవిని తాకింది. ఆ దీవి సౌందర్యం వర్ణనాతీతం. ఎక్కడ చూసినా ఎత్తయిన చెట్లున్నాయి, వాటిమీద రకరకాల పక్షులు మనోహరంగా కూస్తున్నాయి. సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. కాని ఆ దీవిలో మనిషి అన్న వాడు ఎక్కడా కనబడలేదు.

మేమంతా ఈ దీవిమీద కొంతసేపు విశ్రాంతి తీసుకుంటామంటే సరంగు సమ్మతించి లంగరు వేయించాడు. అందరూ దిగి చెట్ల మధ్యగా పచార్లు చేయసాగారు. నేను కొద్ది అహారం తీసుకుని ఒక సెలయేటి ఒడ్డున పచ్చని చెట్లనీడల కిందికి వెళ్ళాను. అలాటి చోట కూచుని భోజనం చెయ్యటమే ఒక విందు అనిపించింది. చల్లగా మలయమారుతం వీస్తున్నది. పచ్చని గడ్డిమీద విశ్రమించి కునుకుతీశాను.

నేను నిద్ర లేచేసరికి దీవిలో ఒక్కరూ లేరు. రేవులో నౌక లేదు. నా సంగతి మరిచిపోయి నౌక మిగిలినవారిని ఎక్కించుకుని కదిలిపోయి వుంటుంది. సముద్రం వేపు పరకాయించి చూస్తే చాలా దూరాన తెరచాపలు కనిపించాయి. నౌక అప్పుడే కనుచూపు మేర దాటి పోతున్నది.

నాకు కలిగిన దిగ్భ్రమా, దైన్యమూ అంతా ఇంతా కాదు. నాకున్న సమస్తమూ ఆ నౌకలో వెళ్ళిపోతూంటే, ఈ నిర్జనమైన దీవిమీద ఒంటరిగా దిగబడిపోయిన నాగతి ఏం కాను? నాకు మతిపోయినట్టయింది. "ఒరే సింద్‌బాద్ నావికుడా! నీ కొంప కూలిపోయింది. మొదటి ప్రయాణంలో నిన్ను కాపాడిన విధి మళ్లీ కాపాడుతుందా? చెయిజారిన కూజా మొదటిసారి పగలకపోతే రెండోసారైనా పగిలితీరుతుంది!" అని గట్టిగా కేక పెట్టాను.

నేను ఏడిచాను. లోపలినుంచి తన్నుకొచ్చే నిస్పృహను వదిలించుకోవటానికి









నెత్తి బాదుకుని కేకలు పెట్టాను. "ఒరే దౌర్భాగ్యుడా! బాగ్దాదులో సుఖంగా కుడిచి కూచోలేకనేనా, తగుదునమ్మా అని మళ్ళీ సముద్రయానం తలపెట్టావు? రాజభోగంగా ఏ లోటూ లేకుండా నీకు జరిగిపోతూ ఉండెనే. నీకు ఏ లోపం జరిగిందని బయలుదేరావు? నీ మొదటి సముద్ర యానం సుఖంగా సాగింది గనకనా?... ఏమనుకుని ఏం లాభం? పుట్టినవాడికి చావు తప్పదు," అనుకుంటూ వెర్రివాడి లాగా అయిపోయి పడిపోయాను.

క్రమంగా నా బుద్ధి వాస్తవాన్ని గుర్తించ సాగింది. గతించినదానికి ఏడిచి ప్రయోజనంలేదు, కర్తవ్యం ఆలోచించాలి. నేను లేచి నిలబడి కొంతసేపు అయోమయంగా నడిచాను. అలా నడవటం క్షేమం కాదనీ, ఏ క్రూరజంతువైనా ఎదురుకావచ్చుననీ తోచి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కాను. ఆ చెట్టుమీదినుంచి చుట్టూ కలయచూశాను. అన్నివైపులా చెట్లూ, పక్షులూ, కొండలూ, గుట్టలూ తప్ప ఏమీ కనిపించలేదు; కాని ఒక దిక్కుగామాత్రం ఏదో తెల్లగా, పెద్దదిగా కనిపించింది. అదేమిటో తెలుసుకుందామని చెట్టు దిగి, ఆ దిక్కుగా నడవ సాగాను. కాని లోపల భయం పీకుతూండటంవల్ల కాలు చురుకుగా సాగలేదు. చిట్టచివరకు ఆ తెల్లని వస్తువు ఒక బ్రహ్మాండమైన బురుజులాగా వున్నట్టు స్పష్టమయింది. లోపలికి పోవటానికి మార్గం యేదైనా ఉందేమో చూతామని దాని చుట్టూ ప్రదక్షిణం చేశాను. కాని ఎక్కడా మార్గం లేదు. పోని దాని పైకి ఎక్కుదామంటే అది నున్నగా గచ్చుచేసినట్టుగా ఉండటం చేత కాలికి పట్టు చిక్కలేదు. అది యెంత ప్రమాణం వుందో చూతామని చుట్టూ అంగలు వేసుకుంటూ తిరిగి యిసకలో పడిన నా కాలి గుర్తులు లెక్కించగా సరిగా నూటయాభై అంగలున్నాయి.







ఈ చిత్రమైన కట్టడంలోకి యెలా ప్రవేశించగలనా అని ఆలోచిస్తున్నంతలో అకస్మికంగా సూర్యుడు కాస్తా మాయమై చీకటి పడ్డట్టయింది. మొట్టమొదట, సూర్యుడికి మబ్బేమైనా అడ్డువచ్చిందా అనుకున్నాను, కాని వేసవికాలంలో మబ్బులెందుకుంటా యని వెంటనే అనిపించింది. సూర్యుడికి అడ్డువచ్చిన దేమిటా అని చూసేసరికి సూర్యుడికి అడ్డంగా ఎగురుతూ ఒక బ్రహ్మాండమైన పక్షి కనబడింది. దాని రెక్కల బారు ఊహించలేనంతగా వుంది.

మొదట నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. కాని తరవాత నేను అదివరకు వినివున్న గండభేరుండ పక్షులు జ్ఞాపకం వచ్చాయి. ఈ పక్షులు యెక్కడో సముద్ర మధ్యన ఒక దీవిలో ఉన్నాయనీ, అవి ఏనుగులను సయితం సునాయాసంగా ఎగర వేసుకుపోతాయనీ నా చిన్నతనంలో అనేక మంది యాత్రికులూ, నావికులూ చెప్పారు. ఆ వచ్చే పక్షి గండభేరుండ పక్షి కావచ్చునని, ఇసకలో వున్న ఈ బురుజులాటిది దాని గుడ్డు కావచ్చుననీ నాకు తోచింది. ఈ నా ఊహ సరిఅయినదని రుజువయింది. ఆ పక్షి నేరుగా వచ్చి ఆ గుడ్డుమీదనే వాలి, తన రెక్కలు రెండువైపులా చాచి నిద్రపో సాగింది.





ఆ పక్షి గుడ్డుమీద వాలే సమయానికి నేను ఇసకలో బోర్లా పడుకున్నాను. తరవాత నేను లేచేసరికి పక్షి కాలు ఒక పెద్ద చెట్టు మానుకన్నకూడా పెద్దదిగా కనిపించింది. నేను వెంటనే నా తలపాగా తీసి విప్పి, దాన్ని జమిలిగా పెనవేసి మోకులాగా తయారుచేసి, దాని సహాయంతో నన్ను నేను ఆ పక్షి కాళ్ళల్లో ఒకదానికి గట్టిగా కట్టేసు కున్నాను. నా ఉద్దేశమేమంటే, ఎప్పుడో ఒకప్పుడు ఈ పక్షి లేచి పోకపోదు. దాని వెంబడి నేనుకూడా వెళ్ళితే, నన్ను అది ఎక్కడైనా మనుషులుండే చోట దించుతుందేమోనని.

ఈ నిర్జనద్వీపంకన్న ఏ చోటైనా నయమే ననిపించింది. నేను దాని కాలికి కట్టుకుంటున్న సంగతి ఆ పక్షికి కొంచెమైనా తెలియవచ్చినట్టు లేదు. నేను దాని ప్రాణానికి ఏ ఈగో, దోమో అన్నట్టుగా వుండివుండాలి.

తెల్లవార్లూ నేను అదే స్థితిలో వున్నాను. నేను నిద్రపోతూండగా అది ఎగిరిపోతుందేమోనని, తెల్లవార్లూ మేలుకునే వున్నాను. కాని పూర్తిగా తెల్లవారినాకనే అది గుడ్డు మీదినుంచి లేచి, ఒక భయంకరమైన కేక పెట్టి, గాలిలోకి లేచింది. అది ఆకాశంలోకి ఎంత యెత్తు ఎగిరిందో చెప్పలేను. అలా చాలా యెత్తు లేచి అతివేగంగా దిగి



రాసాగింది. ఆ పక్షి దిగే వేగానికి నా బరువే నాకు తెలియకుండాపోయింది. చివరకా పక్షి ఒక రాతిమీద వాలింది. నేను వెంటనే నా నడుముచుట్టూ కట్టుకునివున్న తలగుడ్డ విప్పసాగాను. నేను దాని కాలినుంచి విడిపడే లోపుగా మళ్ళీ అది ఎగిరిపోతుందేమోనని నా భయం. నేను కట్టు విడిపించుకుని ఇవతలికి వచ్చి, ఆ పక్షి కళ్ళ పడకుండా యెక్కడ దాక్కుందామా అని చూస్తుండగా ఆ పక్షి మళ్లీ లేచింది. దాని గోళ్ళ మధ్య ఒక నల్లని అసాధారణమైన ప్రమాణంగల పాము చిక్కివుండటం నాకు కనిపించింది. నేను చూస్తూండగానే ఆ గండభేరుండపక్షి పాముతో సహా పైకిలేచి, వేగంగా వెళ్ళిపోయింది.

నేను నా పరిసరాలను కలయచూడగానే నా గుండె ఆగిపోయినట్టయింది. ఎందుకంటే నేను చేరినది ఒక విశాలమైన, లోతైన లోయ. దాని చుట్టూతా చాలా ఎత్తయిన కొండలున్నాయి. వాటి శిఖరాలు చూడటానికి తలయెత్తితే తలగుడ్డ కింద పడిపోవలిసిందే. ఎత్తయితే అయింది, ఎక్కి పైకి పోదామంటే ఆ కొండల అంచులు నిటారుగా, చెక్కినట్టున్నాయి. అవి ఎక్కటం మనుష్యమాత్రుడు చేయగల పని కాదు.

ఆ లోయను చూస్తుంటే నాకు ఏడుపొచ్చింది. ఆ పళ్ళ చెట్లూ, సెలయేళ్ళూ వదిలిపెట్టి నేనిక్కడి కెందుకు రావాలి? ఇక్కడ ఒక్క గడ్డిపరక లేదు, ఒక్క చుక్క నీరుకూడా లేదు. ఇందులో నుంచి బయటపడే మార్గంకూడా లేదు. అందుచేత ఈ భయంకర ప్రదేశంలో ఆకలి దప్పులతో అలమటించి చావక తప్పదు. నేను, ఒక ఆపదనుంచి తప్పించుకోబోయి, అంతకంటె పెద్ద ఆపద తెచ్చిపెట్టుకున్నాను!

(ఇంకా వుంది)





# నావికుడు సింద్‌బాద్

లోయ ఎలా ఉన్నదీ చూద్దామని నడవసాగాను. అక్కడి శిలలు మామూలు శిలలుకావు. అందులో మణులున్నాయి! కిందఅంతటా రాళ్ళనుంచి ఊడి పడిన మాణిక్యాల కుప్పలున్నాయి. కొన్నిచోట్ల ఇవి మనిషి తల యెత్తుకూడా ఉన్నాయి. నేని రత్నాలను చూసి ఆనందించే వ్యవధి అయినా లేకుండా ఒక భీకరదృశ్యం నా కళ్ళ పడింది. ఈ రత్నరాసుల మధ్యగా తాటిబొందలంతేసి లావుగల సల్లని, భయం కరమైన పాములు తిరుగుతున్నాయి. అవి ఏనుగులను సయితం సునాయాసంగా మింగగలవని పించింది. బాగా తెల్లవారితే గండభేరుండపక్షులు తమను చూస్తా యని, ఆ పాములు తమ రహస్య స్థానాలకు వెళ్లి పోతున్నాయి. రాత్రిపూట మాత్రమే అవి ఈ లోయ లలో స్వేచ్ఛగా తిరగగలవు.

పాములు ఎక్కువగా వున్న చోట్లకు దూరంగా వుంటూ పొద్దుగుంకేదాకా నేనా లోయ అంతటా తిరిగాను. నాకు ఆకలి దప్పుల సంగతికూడా జ్ఞాపకం రాలేదు; ఈ పాముల వాత పడకుండా చూసుకోవటం తప్ప నాకు మరే ఆలోచనా లేదు.

రెండవ సముద్రయానం

CHITRA






వెతకగా వెతకగా నా కొక కొండబిలం కనిపించింది. అది నేను దూరేపాటిది. ఆ రాత్రికి అందులో దూరి భద్రంగా వుండ వచ్చు ననుకుని, ద్వారానికి ఒక పెద్దరాయి అడ్డుపెట్టి లోపలికి పాకుతూ వెళ్ళాను. నేను కొద్దిదూరం వెళ్లేసరికే ఒక భయంకర మైన విషయం తెలియవచ్చింది. అదేమి టంటే నేను దూరినది కొండబిలం కానే కాదు—ఒక నల్లపాము చుట్ట! ఆ పాము తన గుడ్లను పొదుగుకోవటానికి అది చుట్ట చుట్టుకు పడుకుంది. ఆ సంగతి గ్రహించ గానే నాకు భరించరాని భయం కలిగి స్పృహ తప్పిపోయింది.

నేనా స్పృహలో నుంచి బయటపడి, రాయి తోసుకుని బయటికి వచ్చేసరికి తెల్ల వారిపోయింది. నా కాళ్లు గుడ్డపీలికల్లాగా ఉండటంచేత నేను సరిగా నిలబడలేకుండా ఉన్నాను. ఆకలి దప్పులవల్లా, విశ్రాంతి లేకా నేను నీరసించి పోయాను. ఇంకా నయం ప్రాణాలతో బయటబడ్డాను. నన్నా పాము మింగేసిందికాదు. నేను లోయలో నిలబడి చుట్టూ కలయచూస్తున్నంతలో తపుక్కుమని మాంసంముక్క ఒకటి నా సమీపంలోనే రాళ్లమీద పడింది.

నేను ఉలికిపడి, అది ఎక్కడినుంచి వచ్చిందో అని తల ఎత్తి చూశాను. కాని ఆ మాంసంముక్క పడవేసినవారు ఎక్కడా కనిపించలేదు.

ఇంతలో నాకు చిన్ననాడు విన్న విషయం ఒకటి జ్ఞప్తికి వచ్చింది; రత్నాలుండే పర్వ తాలలో తిరిగి వచ్చినవారు నాకా విషయం చెప్పారు. రత్నాల లోయనుంచి రత్నా లను సంగ్రహించేవారు, గొర్రెలను కోసి ముక్కలు సరికి వాటిని కొండలమీదినుండి లోయలోకి విసిరివేస్తారు. అవి అదృష్ట వశాత్తూ మణులమీద పడినప్పుడా మణులు మాంసంలో గుచ్చుకుంటాయి. తరవాత గండభేరుండ పక్షులు ఆ ముక్క





లను తన్నుకుపోయి, కొండలమీద ఉండే తమ గూళ్లకు తీసుకుపోతాయి, అప్పుడు రత్నాలను అన్వేషించేవారు పెద్ద పెద్ద చప్పుళ్లు చేసి పక్షిని గూటివద్దనుంచి తరిమేసి మాంసంలో ఇరుక్కుపోయిన రత్నాలను ఏరుకు పోతారు.

ఈ విషయం జ్ఞాపకం రాగానే ఈ లోయలోనుంచి బయటపడే మార్గంకూడా నాకు తట్టింది. నేను వెంటనే పెద్ద పెద్ద రత్నాల కోసం వెతికి వాటిని నా జేబులలోనూ, అంగీలోనూ, ఎక్కడ వీలయితే అక్కడల్లా నించుకున్నాను. తరవాత నా తలపాగా ఊడదీసి, కింద పడిన మాంసం ముక్కను నా పొట్టకు కట్టేసుకున్నాను. తరవాత వెల్లకిలా పడుకున్నాను. కొద్దిసేపట్లో ఏదో పక్షి వచ్చి, మాంసంముక్కను తన గోళ్లతో పట్టుకుని, నన్ను లోయలో నుంచి ఆకాశమార్గాన ఎత్తుకుపోయి తన గూటివద్ద దింపింది. తరవాత అది నా పొట్టకు కట్టిన మాంసాన్నీ, నన్నూకూడా చీల్చి తన బిడ్డలను మేపసాగింది. అదృష్టవశాత్తూ ఇంతలోనే భీకరమైన మోతలు వినపడ్డాయి. పక్షి ఎగిరి చక్కా పోయింది. నేను లేచి నిలబడ్డాను. నా ముఖమూ, దుస్తులూ రక్తంతో తడిసిపోయాయి.



ఇంతలోనే అక్కడి కొక వర్తకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, నన్ను చూసి దిగ్భ్రమ చెందిపోయాడు. అయితే నేను కదలక పోవటమూ, అపకారం చేసేవాడిలాగా కనపడకపోవటమూ చూసి, అతను ధైర్యం తెచ్చుకుని, ముందుకు వచ్చి మాంసం ముక్కను పరీక్షించాడు. అందులో రత్నాలేమీ లేవు. అతను చేతులు పైకెత్తి, "ఓ అల్లా! మోసం! దగా!" అంటూ చప్పట్లు చరిచాడు.

నే నతన్ని మర్యాదగా పలకరించాను. అతను మాత్రం నాతో మర్యాదగా మాట్లాడటానికి మారుగా, "ఎవరు నువు? నా సొత్తు





దొంగిలించటానికి ఇక్కడికి ఏం వచ్చావు?" అన్నాడు కోపంగా.

"భయపడకండి, షావుకారుగారూ. నేను దొంగను కాను. మీ సొత్తేమీ హరించనూ లేదు. నన్ను చూసి ఏ భూతమో, పిశాచమో అనుకోకండి; నేను మనిషినే, వర్తకుణ్ణే. నే నిక్కడ ఉండటమే ఒక విచిత్రమైన కథ. ఆ కథ మీకు చెబుతాను. కాని ముందుగా నేను మీకు స్నేహపూర్వకంగా కొన్ని రత్నాలిస్తాను, స్వీకరించండి. మనుష్యమాత్రు డెవడూ ఎన్నడూ అడుగు పెట్టని రత్నాల లోయలో నేను వీటిని ఏరాను," అన్నాను.

ఈ మాట అంటూ నేను ఏరిన రత్నాలలో చాలా పెద్దవి కొన్ని తీసి ఆ వర్తకుడి చేతిలో పెట్టాను. అవి తీసుకుని అతను పరమానందభరితుడై నన్ను భట్రాజు పొగిడినట్టు పొగిడి, "ఈ మణులలో ఒక్కటి చాలు, నా జన్మపొడుగునా భాగ్యవంతుడుగా జీవించగలను. నా జన్మలో ఇంత వెలగల రత్నాలు, ఎంత గొప్ప వర్తకుడివద్దా చూడలేదు. ఆఖరుకు రాజుల వద్దకూడా ఇంత విలవైనవి ఉండవు!" అన్నాడు ఆశ్చర్యంగా.

ఇంతలోనే మిగిలిన వర్తకులుకూడా వచ్చారు. వారందరికీ నా కథ చెప్పాను.



వాళ్ళు నా కథ విని చాలాసేపు ఆశ్చర్యపడి, తరవాత, "అల్లా అనుగ్రహంవల్ల మీరా లోయనుంచి బయటపడ్డారుగాని, మానవ మాత్రుడి కది సాధ్యమయే పని కాదు!" అని అభినందించారు. నేను శోషతో పడి పోయే స్థితిలో ఉండటం గమనించి, పాపం, వారు నన్ను తమ గుడారానికి చేర్చి కడుపు నిండా తిండి పెట్టారు, పానీయా లిచ్చారు. ఆ గుడారంలో నే నొక పగలూ, రాత్రి హాయిగా నిద్రపోయాను.

మర్నాడు ఉదయం మేమంతా కలిసి బయలుదేరి కొండలు దిగి సముద్రతీరాన్ని చేరుకున్నాం. అక్కడినుంచి పడవలో బయలుదేరి కర్పూరద్వీపం వెళ్లాం. అక్కడ బ్రహ్మాండమైన కర్పూర చెట్లున్నాయి. ఎంత ఎండలోనైనా వాటికింద చల్లగా ఉంటుంది. ఒక్కొక్క చెట్టునీడలో వందేసి మంది సుఖంగా విశ్రమించ వచ్చు. ఈ చెట్ల బోదెలకు గాట్లు పెడతారు. వాటి నుంచి కారే సొనను కుండల్లో పట్టి సువాసన గల హారతికర్పూరం తయారుచేస్తారు.

ఈ ద్వీపంలోనే నేనొక భయంకరమైన మృగాన్ని చూశాను. అది ఖడ్గమృగం జాతిదేగాని అంతకంటె చాలా పెద్దది, ఒంటెకన్న ఎత్తుంటుంది. దాని ముట్టెపై పదిమూరల ఎత్తు కొమ్ముంటుంది. అది



మామూలుగా ఆకులూ అలములూ మేస్తూ దున్నలాగా సంచరిస్తుంది. కాని దానితో తలపడితే ఏనుగుకూడా దాన్ని గెలవలేదు. అది ఏనుగును తన కొమ్ముతో పొడిచి అవలీలగా పైకి ఎత్తేస్తుంది. ఏనుగు చచ్చిపోతుంది, కాని ఏనుగు మదం కారి ఈ ఖడ్గమృగానికి కళ్ళు కనిపించవు. ఈ దశలో గండభేరుండపక్షి వచ్చి రెంటినీ తన్నుకుపోతుంది. ఈ ద్వీపంలో అనేక రకాల బర్రెలనుకూడా చూశాను.

ఈ ద్వీపంలో కొద్దిరోజులు ఆనందంగా గడిపాం. నేను తెచ్చిన మణులలో కొన్నిటిని విక్రయించి బంగారమూ, వెండీ కొన్నాను. వాటిని వెయ్యటానికి ఒక పడవ చాలింది కాదు. అక్కడినుంచి బయలుదేరి ఎన్నో దీవులు, ఎన్నో దేశాలు, యెన్నో నగరాలు చూసుకుంటూ, ప్రతిచోటా క్రయవిక్రయాలు జరుపుతూ చిట్టచివరకు బస్రా చేరి, అక్కడినుండి నదివెంబడి బగ్దాదు నగరం చేరుకున్నాను. అంతులేని బంగారమూ, వెలలేని రత్నాలూ వెంటబెట్టుకుని ఇంటికి వెళ్ళాను. బంధు మిత్రులందరూ నన్ను చూసి పరమానందం పొందారు. ఎరిగినవారిని ఒక్కరినికూడా బీరుపోనివ్వకుండా అందరికీ బహుమతులు ఇచ్చాను.

ఆనాడు లగాయతు సుఖమైన భోజనాలు చేస్తూ, విలవైన పానీయాలు తాగుతూ, వెలగల వస్తువులు ధరిస్తూ, హంసతూలికా తల్పాలమీద శయనిస్తూ రాజవైభోగంగా జీవితం సాగించాను. నా చుట్టూ ఆప్త మిత్రులు అస్తమానం ఉండేవారు.

రోజూ ఎందరెందరో గొప్పవాళ్లు నన్ను చూడవచ్చి దూరదేశాల వార్తలు వినేవారు. వారికి కావలిసిన విషయాలన్నీ చెప్పేవాణ్ణి. నా అనుభవాలు విన్నవారందరూ, ప్రాణాలతో బయటపడినందుకు నన్ను అభినందించేవారు. నా రెండవ సముద్రయానం ఈ విధంగా ముగిసింది.



# నావికుడు సింద్‌బాద్

రోజులు సుఖంగా వెళ్లిపోతున్నకొద్దీ నేను పడిన కష్టాలు మరిచిపోసాగాను. క్రమంగా నాకి సుఖాల మీద ముఖంమొత్త నారంభించింది. తిరిగి అనుభవాలు సంపాదించాలన్న కోరికా, వర్తకం సాగించాలన్న కాంక్షా నాలో తలఎత్తాయి. దురాశ దుఃఖం చేటన్న మాట అబద్ధంకాదు. ఈ సంగతి నా విషయంలో త్వరలోనే రుజువయింది. నేను ఖరీదైన సరుకులు కొని వాటితో బస్రా చేరాను. అక్కడ ఒక పెద్ద వర్తకపు ఓడ ప్రయాణానికి సిద్ధంగా ఉంది. అందులో స్నేహపాత్రులైన వర్తకులు అనేకమంది ఉన్నారు. వారు ఆపత్సమయంలో ఆదుకోగలవారు. వారితో కలిసి నేనుకూడా ఓడలో ప్రయాణమయాను. అల్లాను స్మరించి లంగరు ఎత్తించాము.

ఈ ప్రయాణంలో అన్నీ శుభశకునాలే అయాయి. మేము రేవు తాకిన చోటనల్లా లాభసాటిగా వర్తకం జరిగింది. మాకు ఎన్నో కొత్త విషయాలుకూడా తెలిశాయి. మా ఆనందానికి ఎలాటి విఘ్నమూ కలగలేదు.

మేము ముస్లిము దేశాలకు చాలా దూరాన నడి సముద్రంలో ఉన్నాం. ఆ సమయంలో ఒకనాడు

మూడవ సముద్రయానం

CHITRA

మా ఓడ సరంగు సముద్రం అంచును పరికిస్తున్నవాడల్లా అరిచేత్తో నుదురు కొట్టుకుని, గడ్డం పీక్కుని, చొక్కా చించుకుని, తల గుడ్డ విసిరి కింద కొట్టాడు.

అతని విషాద స్థితి చూసి ఆశ్చర్య పడుతూ అతన్ని చుట్టుముట్టి, "ఏమిటిది?" అని అడిగాం.

"అయ్యో, స్నేహితులారా! గాలి మనను మోసగించి రాగూడని సముద్రప్రాంతానికి తెచ్చింది. మన దురదృష్టంవల్ల మనం ఆ కనపడే దీవిని చేరబోతున్నాం. ఇక మనకు మూడినట్టే. ఎందుకంటే ఆ దీవిలో అడుగు పెట్టి ప్రాణాలతో బయటపడినవాడు ఇంత వరకు లేడు. అది మర్కటాల దీవి. మనం చచ్చినవారిలో జమే!" అంటూ సరంగు వాపోయాడు.

ఆయన ఇలా మాట్లాడుతూండగానే విచిత్రమైన జంతువులు, మిడతల దండు లాగా లుకలుకలాడుతూ, సముద్రంలో ఈదుకుంటూ వచ్చి మా ఓడను చుట్టుముట్టాయి. మరి కొన్ని తీరంలోనే ఉండి భయంకరమైన అరుపులు అరిచాయి. ఆ అరుపులకు రక్తం జిల్లుమని గడ్డ కట్టుకుపోయింది. మేమా జంతువుల జోలికి పోలేదు. పోతే, అవి సంఖ్యా బలంచేత మమ్మల్ని తుదముట్టిస్తాయని భయం.





నిజానికి సంఖ్యాబలం ముందు శౌర్యసాహ సాలేం పనికివస్తాయి? ఈ మర్కటాలు ఓడ ఎక్కివచ్చి మా సరుకులను తడివి చూడసాగాయి.

ఈ జంతువులు నేను చూసిన వికార మైన జంతువులన్నిటికన్నా వికారంగా ఉన్నాయి. వాటి ఒంటి నిండా జూలున్నది. వాటి ముఖాలు నల్లగానూ, కళ్లు ఆకు పచ్చగానూ ఉన్నాయి. వాటి ఎత్తు మూడు జానలు మించదు. వాటి ముఖ వికారాలూ, అరుపులు మనం ఊహించలేనంత భయం కరమైనవి. అవి పళ్లు కొరుకుతూ, మష్షుల్ని తిడుతూ, మాతో మాట్లాడుతున్నట్టు స్పష్ట మయింది. కాని వాటి భాష మాకు తెలీదు. మేం అసహాయులమై అలా నిలబడివుండగా అవి తెరచాప స్తంభాలు ఎగబాకి, తమ దంతాలతో తాళ్ళు కొరికి, తెరచాపలను కింద పడేశాయి. తరవాత చుక్కాని వశ పరుచుకుని, అవి గాలివాలున పడవను తీరానికి నడిపాయి. తరవాత అవి మష్షుల్ని ఒక్కొక్కరినే పట్టుకుని తీరానికి చేర్చాయి. ఆ తరవాత అన్నీ కలిసి ఓడలో యెక్కి, సముద్రంమీదికి వెళ్ళి కనుచూపుమేర దాటి పోయాయి.

మేం కాస్తా దీవిలో చిక్కుపడిపోయాం. ఆ ఇసుక తీరంలో నిలబడి చేయగలది ఏముందిగనకా? అందుచేత దీవిలోకి బయలుదేరాం. అక్కడ మాకు పళ్ళ చెట్లూ, వాగులూ కనిపించాయి. ఈ చెట్ల పళ్ళు కోసుకుని తింటూండగా దూరాన మా కొక పెద్ద భవనం కనబడింది.

మేం దానికేసి వెళ్ళాం. అది నలుచద రంగా, ఎత్తుగా ఉన్న భవంతి. దాని చుట్టూ బలమైన ప్రహరీగోడ ఉన్నది. గోడ ద్వారానికి గల తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి. అక్కడ రక్షకభటు లెవరూ లేరు. అందుచేత మేం నేరుగా లోపలికి వెళ్ళాం. లోపల చాలా విశాలమైన హాలు





ఒకటి ఉన్నది. అందులో బ్రహ్మాండమైన వంట పాత్రలు, మాంసం గుచ్చి కాల్చే ఇనపకాడలూ ఉన్నాయి. నేలమీద ఎముకల పోగుల గుట్టలున్నాయి. వాటిలో కొన్ని ఎండిపోయీ, కొన్ని పచ్చిగానూ ఉన్నాయి. దుర్గంధానికి ముక్కులు పగిలిపోతున్నాయి. అయినా మేం డస్సిపోయి ఉండటంచేత అక్కడే పడుకుని నిద్రపోయాం.

సూర్యాస్తమయమైన కొద్దిసేపటికల్లా ఉరుములాంటి చప్పుడు విని మేం లేచి కూచున్నాం. ఒక భూతంలాటి కారునలుపు వాడు పైకప్పునుంచి దిగుతూ మాకు కనిపించాడు. వాడు తాటిచెట్టు ఎత్తున్నాడు, మర్కటాలన్నిటినీ మించి వికారంగా ఉన్నాడు. వాడి కళ్ళు నిప్పుల కుంపట్ల లాగా ఎర్రగా వెలుగుతున్నాయి. వాడి పక్కపళ్ళు అడవిపంది కోరల్లాగా పొడవుగా వంపుతిరిగి ఉన్నాయి. వాడి కింది పెదవి రొమ్ముమీదికీ, వాడి చెవులు భుజాలమీదికీ వేళ్ళాడుతున్నాయి. వాడి వేలిగోళ్లు సింహం గోళ్ళలాగా ఉన్నాయి.

మాకు భయంతో చెయ్యీ, కాలూ ఆడలేదు. ఆ రాక్షసుడు గోడవారనే ఉన్న ఒక బల్లమీద కూచుని మమ్మల్ని ఒక్కొక్కరినీ పరిశీలనగా చూశాడు. చివరకు వాడు మావద్దకు వచ్చి నన్ను మెడమీది చర్మం



పట్టుకుని, పిల్లికూనను ఎత్తినట్టు ఎత్తి, అటూ ఇటూ తిప్పిచూశాడు, నా తల తడివి చూశాడు. నేను వాడికి నచ్చినట్టు కనబడలేదు. నే ననలే బక్కపల్చని మనిషిని, ప్రయాణాలమూలంగా మరింత చిక్కి ఉన్నాను. వాడు నన్ను కింద పారేసి, నా పక్కవాణ్ణి అలాగే ఎత్తిచూసి, వాణ్ణికూడా కిందపారేసి, మరొకణ్ణి ఎత్తాడు. ఇలా అందరినీ పరీక్షించాక, చివరకు ఓడ సరంగు వంతు వచ్చింది.

మా సరంగు అజానుబాహువు, మంచి పుష్టి కలవాడు. అందుచేత ఆ రాక్షసుడు అతన్ని విరిచి చంపి, ఇనపకాడకు గుచ్చి, నిప్పుమీద కాల్చి నిశ్చింతగా తినేసి, ఇల్లమీద పడుకుని గురక పెడుతూ నిద్రపోయాడు. మా కెవరికీ ప్రాణాలలో ప్రాణాలు లేవు. ఆ రాక్షసుడు తెల్లవారి లేచి బయటికి వెళ్ళిపోయినదాకా మేము కుక్కిన పేలలాగా ఉండిపోయాం. ఆ తరవాత మా దుస్థితిని తలుచుకుని బావురుమని ఏడిచాం. ఏం చెయ్యాలో మాకు తోచలేదు. మమ్మల్ని ఆపేవారు లేరుగనక భవనం దాటి బయటికి వెళ్ళి దాక్కునేటందుకు చోటు దొరుకుతుందేమోనని చూశాం. కాని ఆ దీవిలో రహస్య ప్రదేశమన్నది కనిపించలేదు. ఈ రాక్షసుడి వాత



పడి చచ్చేకన్న సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకోవటం మేలని కొందరన్నారు. అంతదాకా వస్తే ఆ రాకాసుణ్ణి చంపి చావటం మంచిదని మరి కొందరన్నారు. ఎట్లాగూ చావు తప్పేటట్టు లేదుగనక రాకాసుణ్ణి చంపటానికే నిశ్చయించాం. ఆ తరవాత పారిపోవటానికి సాధనం ఉండాలి గనక, సముద్రతీరాన ఉన్న కొయ్యలతో ఒక తెప్ప తయారుచేసి పొద్దూకే సమయానికి భవనానికి తిరిగి వచ్చాం.

మామూలు వేళకు రాకాసుడు రానే వచ్చాడు. వాడు మాలో మరొకణ్ణి చంపి తిని, బల్లమీద పడుకుని భూమి దద్దరిల్లేట్టు గురకపెట్టసాగాడు. చావగా మిగిలినవాళ్లం రెండు ఇనపకాడలు నిప్పుల్లో ఎర్రగా కాల్చి చెరొక కాడనూ ముగ్గురు నలుగురుచొప్పున మోసుకుని పోయి ఆ రాకాసుడి రెండు కళ్లలోనూ గుచ్చాం. వాడు బాధతో పెట్టిన అరుపులు వర్ణనాతీతమైనవి.

వాడి కళ్లయితే పోయాయిగాని వాడు చావలేదు. మాకోసం వాడు అంతటా తడవసాగాడు. కాని మేం వాణ్ణి సులువుగా తప్పించుకోగలిగాం. వాడు తడువుకుంటూ వాకిలి తెరుచుకుని బయటికి వెళ్లిపోయాడు. తప్పించుకుపోవటానికి అదే సమయమని సముద్రతీరానికి పరిగెత్తి, మేం తయారు చేసి ఉంచిన తెప్పమీద యెక్కి సముద్రం మీదికి తోసుకు పోసాగాం.

ఇంతలో పెడబొబ్బ ఒకటి వినిపించింది. కళ్ళులేని ఆ రాకాసుణ్ణి, వాడికన్న వికారమైన ఒక ఆడ రాకాసి నడిపిస్తున్నది. ఇద్దరూ కలిసి సముద్రతీరానికి వచ్చారు. వాళ్ళు మా తెప్పమీదికి పెద్ద పెద్ద బండ రాళ్ళు విసిరారు. వీటిలో కొన్ని గురిగా తగలటంవల్ల నేనూ, మరి ఇద్దరూ తప్ప మిగిలినవారంతా సముద్రంలో పడి పోయారు. మేము ముగ్గురమూ ఆ రాళ్ళ బారి దాటి పోగలిగాం. (ఇంకా వుంది)



# నావికుడు సింద్‌బాద్

రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ మేం గాలివాలున కొట్టుకుపోయి మరొక దీవిలో వెళ్ళి పడ్డాం. అప్పటికి మేం కడప్రాణాలతో ఉన్నాం. మేం కానిని పళ్లు తిని, నీరుతాగి, ఒక ఎత్తయిన చెట్టు ఎక్కేసరికల్లా చీకటిపడి పోయింది. మేమా రాత్రి చెట్టుమీదనే నిద్ర పోయాం.

తెల్లారి మేం కళ్ళు తెరిచేసరికి మా కంగారు ఏమని చెప్పను! ఒక భయంకరమైన సర్పం, మే మెక్కి ఉన్న చెట్టుబోదె అంత లావుది, గుహలాగా నోరు తెరుచుకుని మా వైపే వస్తున్నది. అది మమ్మల్ని చూడగానే మా ఎత్తు లేచి, నావెంట ఉన్నవారిలో ఒకణ్ణి కబళించేసి వెళ్ళిపోయింది.

అది వెళ్ళిపోయాక నేనూ, రెండవవాడూ కలిసి చెట్టు దిగి, ఇన్ని పళ్ళు కోసుకు తిని, నీళ్ళు తాగి, ద్వీపమంతా ఘాలించి. ఇంకా ఎత్తయిన చెట్టు చూసుకుని, దానిమీద ఎక్కి ఆ రాత్రికి నిద్రపోయాం. కాని తెల్లవారేసరికల్లా ఆ దుష్ట సర్పం మేమున్న చోటికి తయారయింది. అది అవలీలగా చెట్టుకు తన శరీరం పెనవేసి పైకి పాకి నా వెంట ఉన్న రెండో వాణ్ణికూడా మింగేసి వెళ్ళిపోయింది.

మూడవ సముద్రయానం

CHITRA





నాకు చెప్పరాని దడ పుట్టుకొచ్చింది. ఇక నేనుమాత్రమే మిగిలిఉన్నాను. మేమా రాక్షసుడి నోట పడకుండా తప్పించుకు వచ్చినది ఈ క్రూరసర్పం నోట పడటానికేనా? "ఛీ, ఇంతకంటె ఆత్మహత్య చేసుకుంటే నయం!" అనిపించి నేను సముద్ర తీరానికి పరిగెత్తాను.

కాని జీవితేచ్ఛ అతి చిత్రమైనది. అది ప్రాణంపై ఆశను అంత సులువుగా వదులుకోదు. పామును తప్పుకునేటందుకు నాకు ఒక ఉపాయం తట్టింది. నేను సముద్రం ఒడ్డున గల కలప పోగుచేసి నాలుగు వెడల్పయిన చెక్కలు నాలుగు వైపులా అడ్డంపెట్టుకుని, వాటిమధ్య పడుకుని, పైన కొన్ని కర్రముక్కలు వేసుకున్నాను. పాము దాని వేళకు అది వచ్చింది. ఆ చెక్కల నందునుంచి నన్ను బయటికి తీయాలని విశ్వప్రయత్నాలు చేసి విఫలమయింది. చివరకు విసుగెత్తి అది నన్ను విడిచి తన దారిన వెళ్ళిపోయింది.

అది వెళ్లిపోయిందని రూఢిచేసుకున్నాక నేను చెక్కలు తోసివేసి బయటికి వచ్చి సముద్రతీరానికి వెళ్ళాను. సముద్రంమీద దూరాన ఒక ఓడ కనిపించింది. నేను వెర్రివాడిలాగా కేకలువేస్తూ చేతులూపాను. తరవాత ఒక చెట్టుకొమ్మకు తలపాగా విప్పి






కట్టి అడించాను. అదృష్టవశాత్తూ ఇది ఓడవాళ్ళ కళ్ళబడింది. ఓడ దారితప్పించి ద్వీపంవేపు వచ్చింది. త్వరలోనే అది ఓరాన లంగరు వేసుకున్నది. ఓడకళా సులు నన్ను ఎక్కించుకున్నారు.

ఓడలోకి ఎక్కగానే నాకు మంచి దుస్తులిచ్చారు, సుష్టుగా భోజనం పెట్టారు. చాలా బడలిఉన్నానేమో, సుఖమైన నిద్ర పట్టింది. మృత్యుదేవత కళ్ళలోకి చూసి, చూసి హతాశుడినై ఉన్న నాలో మళ్ళీ జీవచైతన్యం కలిగింది. క్రమంగా నేను మామూలు మనిషినైపోయి గడిచిన కష్టాలను పీడకలలకింద పరిగణించసాగాను.

మా ప్రయాణం సుఖంగా సాగింది. చివరకు మేం సలాహితా అనే ద్వీపం చేరాం. రేవులో లంగరు దించగానే ఓడ లోని వర్తకులంతా క్రయవిక్రయాలు చెయ్యటానికి కిందికి దిగివెళ్ళారు. అప్పుడు ఓడసరంగు నాదగ్గిరికి వచ్చి, "చూడు, బాబూ! నువు అతి పేదవాడివిగా, దిక్కు లేనివాడివిగా కనబడుతున్నావు. చాలా కష్టాలు పడ్డానంటున్నావు. కనక నీకు ఒక సహాయం చేస్తాను. నిన్ను నీ గ్రామం చేరుస్తాను. ఇంతకాలంగా పడ్డబాధలన్నీ మరిచిపోయి నా పేరు చెప్పుకుని సుఖంగా బతుకుదువుగాని," అన్నాడు.





"అయ్యా, ఏం సహాయం చేసినాసరే మీ మేలు ఎన్నటికీ మరవను," అన్నాను.

"అయితే విను. కొన్ని ఏళ్లక్రితం మా వెంట ఒక వర్తకుడుండేవాడు. అతను ప్రయాణంలో ఒక దీవిలో దిగబడి పోయాడు. ఆతరవాత అతని జాడే తెలియలేదు. అతను బతికే ఉన్నాడో, చచ్చిపోయాడో! అతని సరుకంతా కొట్టులో వేసి ఉంది. అదంతా నీపరం చేస్తాను. దాన్ని తీసుకుపోయి విక్రయించి, కొంత వట్టంకింద నువు ఉంచుకుని మిగిలినది నాకిచ్చెయ్యి. నేను దానిని తీసుకుపోయి అతని బంధువులకు అందజేస్తాను," అన్నాడు సరంగు.

"ఆ పని చేసినట్టయితే నన్ను బతికించిన వారవుతారు. ఈ పరిస్థితిలో అంత న్యాయంగా డబ్బు సంపాదించుకోవటంకంటె కావలిసిన దేమిటి?" అన్నాను.

అప్పుడు సరంగు గుమాస్తాను దగ్గిరకు పిలిచి, "బేళ్ల నన్నిటినీ చిట్టాలో రాయవయ్యా!" అన్నాడు.

"చిత్తం. వీటిని ఎవరిపేర రాయమన్నారు!" అని గుమాస్తా అడిగాడు.

"ఈ సరుకంతా నావికుడు సింద్‌బాద్‌ది. కాని దానిని ఈ మనిషిపేర రాయి. పేరు అతన్నే అడిగి కనుక్కో," అన్నాడు సరంగు.

"నేనే నావికుడు సింద్‌బాద్‌ను!" అని కేకపెట్టాను, ఆశ్చర్యంతో. నేను సరంగును పరికించి చూతునుగదా, నా రెండవ సముద్రయానమప్పుడు నన్ను ఒక దీవిలో వదిలిపెట్టి నౌకను తరలించుకు పోయిన సరంగు ఇతనే!

నేను సంభ్రమంతో, "నన్ను గుర్తించలేదా? నేను నిజంగా నావికుడు సింద్‌బాద్‌నే! బాగ్దాద్ వర్తకుణ్ణి. నా కథ వినండి. నేనే చాలా ఏళ్లక్రితం ఆ ద్వీపం మీదికి వెళ్ళి తిరిగి పడవ అందుకోలేక పోయాను. మంచి సెలయేటిపక్క భోజనం చేసి పడుకుని నిద్రపోయాను. నేను నిద్ర





లేచేసరికి పడవ అప్పుడే కనుచూపుమేర దూరం వెళ్ళింది. ఆ తరవాత రత్నాల పర్వతం వెళ్ళిన వర్తకులు నన్ను చూశారు. వారిలో ఎవరైనా యిక్కడవుంటే నన్ను గుర్తించగలరు," అన్నాను.

నేనీ ధోరణిలో మాట్లాడుకుపోతున్న సమయంలో ఒక వర్తకుడు, వెంటబెట్టుకు పోయిన సరుకంతా అమ్మేకాడుకాబోలు, మరికొంత సరుకుకోసం నౌకకు తిరిగి వచ్చాడు. నా ముఖంకేసి పరకాయించి చూసి, ఆశ్చర్యంతో చేతులు రెండూ కలిపి పట్టుకుని, "అరే, అల్లా! నా మాట ఒక్కరు నమ్మలేదు. గండభేరుండపక్షి రత్నాల లోయలోనుంచి మనిషిని పైకి తీసుకురావటం కళ్ళారా చూశానంటే అన్నీ వట్టివే నన్నారు! ఇదిగో ఆ మనిషి! సింద్‌బాద్ నావికుడు—నాకు వెలలేని రత్నాలిచ్చిన ధర్మాత్ముడు," అంటూ నన్ను ఆలింగనం చేసుకున్నాడు.

అప్పుడుగాని సరంగు నన్ను పోల్చుకోలేదు. అతను నా చేతులు రెండూ పట్టుకుని ప్రాణాలతో బయటపడినందుకు నన్ను తెగ అభినందించాడు. తరవాత నా సరుకు లన్నీ రేవులో దింపించాడు. వాటిని విక్రయించగా నాకు అంతులేని లాభం వచ్చింది.

సలాహితానుంచి బయలుదేరి సింధు దేశం వెళ్ళాం. అక్కడి సముద్రాలలో నేను ఆవుముట్టె గల చేపలనూ, గాడిదముట్టె గల చేపలనూ, పక్షుల్లాగా ఎగిరే చేపలనూ చూశాను. ఈ విధంగా మేం బహుకాలం సముద్రాలపై తిరిగి ఎట్లాగైతేనేం బస్రా చేరుకున్నాం. అక్కడినుంచి నా స్వస్థలమైన బగ్దాద్‌నగరం వెళ్ళి, బంధుమిత్రుల నందరినీ కలుసుకున్నాను.

కిందటిసారికన్న ఎక్కువ లాభంతో తిరిగివచ్చాను గనక నగరంలోని పేదసాదలందరికీ దానధర్మాలు చేశాను. మళ్ళీ నా జీవితం సుఖవంతంగా నడవసాగింది.



# నావికుడు సింద్‌బాద్

మనం కష్టాలకు గురి అయేసమయంలో వాటిని ఎట్లా భరించగలమా, అవి ఎప్పుడు గడిచిపోతాయా అనిపిస్తుంది. కాని అవి తొలగిపోయి సుఖమైన రోజులు వచ్చాక వెనక్కుతిరిగి చూసుకుంటే ఆ కష్టాలలోనే ఏదో ఆనందం కనిపించి, వాటిని గురించి అప్పట్లో, ఎందుకు అంతగా దిగులుపడ్డామా అని ఆశ్చర్యపోతాం.

నేను మూడు భయంకరమైన సముద్రయానాలు చేసి ఇంట సుఖంగా కుదిచి కూచునికూడా, ఈ భోగాలలో మునిగి తేలటంకంటె మళ్లీ ప్రపంచ పర్యటన చేసి అనుభవాలు సంపాదించటమే మేలనిపించింది. వర్తకంచేసి డబ్బు మరింత గడించాలని కూడా కోరిక కలిగింది. ఈ కోరిక రానురాను ఎంత తీవ్రంగా పరిణమించిందంటే నేనిక ఒక్క క్షణం కూడా ఇంట నిలవలేక పోయాను. తిరిగేకాలూ, తిట్టే నోరూ ఊరుకోవని ఇందుకే అంటారు.

విధి తోసినట్టుగా ఒకనాడు నేను నా ఇల్లూవాకిలీ, ఆస్తిపాస్తీ వదిలేసి, పూర్వంకన్న ఎక్కువ ఖరీదైన సరుకులు కొనుక్కుని వాటితో బస్రా చేరాను.

నాలుగవ సముద్రయానం

CHITRA



అక్కడ ఒక పెద్దనౌక పట్టుకున్నాను. ఆ నౌకలోనే అనేకమంది బస్రా వర్తకులు కూడా ప్రయాణమైనారు.

ఈ నౌక చాలా వేగంతో పోగలది. అది ఎన్నో దీవులకూ, ఎన్నో దేశాలకూ వెళ్లింది. నౌక లంగరు దించినచోటనల్లా వర్తకం మహాచురుకుగా, అమిత లాభసాటిగా జరిగింది. కాని ఉన్నట్టుండి ఒకనాడు నడి సముద్రంలో సరంగు లంగరు దింపించి, "మన పని అయిపోయింది!" అని ఎలుగెత్తి అరిచాడు. ఆ క్షణంలోనే ఉప్పెన గాలి సాగింది. తాడిప్రమాణాన కెరటాలు నౌకచుట్టూ లేచి అనేకవేల ఏనుగుల శక్తితో నౌకను బాదసాగాయి. కొద్దిసేపట్లోనే నౌక వాటి తాకిడికి ముక్కలుచెక్కలైపోయింది. నౌకలోని సరుకంతా సముద్రుడు మింగేసి తన పొట్టన పెట్టుకున్నాడు. వర్తకులలో చాలామంది తమ సరుకులతోపాటే సముద్రంలో సమాధి అయిపోయారు.

అల్లా కటాక్షంవల్ల నేనూ, మరికొందరు వర్తకులూ ఒక విశాలమైన చెక్కలతెట్టును ఆశ్రయించ గలిగాం. అలలు మమ్మల్ని ఒకపూటల్లా అటూ ఇటూ కొట్టాయి. తరవాత పెద్దగాలి మమ్మల్ని ఒక ఒడ్డున పారేసింది. మేమందరమూ ఉప్పెన తాకిడికి మూడుపంతులు చచ్చిఉండటంవల్ల,





ఆ రాత్రల్లా సముద్రతీరాన ఇసకలో ఎట్లా పడినవాళ్లం అట్లాగే సొమ్మసిల్లి బాగా నిద్ర పోయాం.

తెల్లవారి లేచేసరికి మాకు కాస్త శక్తి వచ్చినట్టనిపించింది. అందుచేత మేం బయలుదేరి లోప్రాంతాలకేసి వెళ్లాం. కొంతదూరం వెళ్లేసరికి అంత దూరాన ఒక భవనం కనబడింది. మేము చూస్తుండగానే ఈ భవనం ద్వారంలోనుంచి అనేక మంది కారునలుపు వ్యక్తులు పరిగెత్తుకుంటూ మా వైపు వచ్చారు. వారు జంతువుల చర్మాలు ధరించి ఉన్నారు. మాటా పలుకూ అడకుండా వారు మమ్మల్ని భవనంలోనికి విశాలమైన సావిడిలోకి తీసుకుపోయారు. అక్కడ ఎత్తయిన సింహాసనం మీద ఒకరాజు కూచుని ఉన్నాడు. కూచోమని ఆయన మాకు సైగచేశాడు.

క్షణంలో నల్లటివాళ్లు మా ముందు కంచాలలో కనీవినీ ఎరగని కూరలతో భోజనం ఉంచారు. వాటిని చూస్తే నాకు అంట బుద్ధికూడా కాలేదు. కాని నా మిత్రులు బాగా ఆకలిగొని ఉన్న కారణం చేత అవురావురుమని కంచాలలో పెట్టిన ఆహారం తినేశారు. నేనా ఆహారం తినక పోవటం మేలయిందని నాకు తరవాత తెలిసి వచ్చింది.

నా స్నేహితులైన వర్తకుల ఆకలి ఆహారం తింటున్నకొద్దీ జాస్తీ కాసాగింది. వారు గంటల తరబడి తమ కంచంలో వడ్డించినదల్లా ఆత్రంగా తినసాగారు. అంతకంతకూ వాళ్లు తినే పద్ధతికూడా పశువులు తినే ధోరణిలోకి దిగసాగింది.

వాళ్లు ఒకవంక తింటూండగానే నల్లవాళ్లు ఒకజాడీలో ఏదో లేపనం తెచ్చి వాళ్ల శరీరాలకు పూయసాగారు. దీని ప్రభావం చూసితీరాలి. నా మిత్రుల పొట్టలు ఒక్కొక్క అంగుళమే ఉబ్బికురావటం నేను కళ్లారా చూశాను. పొట్టలు ఉబ్బిపోతున్నకొద్దీ వారి








ఆకలికూడా హెచ్చిపోయింది. ఆ ఆకలి ఎంతకీ తీరేదిగా లేకపోవటం చూసి నేను నిర్ఘాంత పోయాను.

ఇదంతా కళ్లారా చూస్తూ నేను ముద్ద ఎట్లా నోటపెట్టుకునేది! నా శరీరానికి లేపనం పూయవస్తే నేను నిరాకరించాను. ఇదీ నాకు మేలే అయింది. ఎందుచేతనంటే, వీళ్లు నరభక్షకులనీ, చంపితినటానికే వాళ్ళా విధంగా మనుషులకు కొవ్వుపట్టేట్టు తినిపిస్తారనీ నాకు త్వరలోనే తెలిసింది. ఇంకో ఘోరమేమంటే, వీళ్లరాజు రోజుకొక మనిషిని కాల్చుకుతింటాడు; వీళ్లుమటుకు పచ్చిమనుషులనే పీక్కుతింటారు.

ఈ విషయాలు నాకు తెలియవచ్చాక నా గతి, నా స్నేహితుల గతి ఏమవుతుందోనని నేను చాలా ఆందోళనచెందాను. పైగా నా మిత్రులపొట్టలు పెరిగిపోతున్నకొద్దీ వాళ్ల వివేకం క్షీణించి పోతున్నట్టు స్పష్టమయింది. చిట్టచివరకు వాళ్లు వేటపశువుల్లాగా అయిపోయారు. ఆ నల్లటివాళ్లు వీళ్లని దూరంగావున్న పచ్చికమైదానాలమీదికి మేపటానికి తోలుకు పోయారు!

నేను భయంతోనూ, ఆకలితోనూ చిక్కి శల్యమైపోయాను. నా చర్మం ఎముకలకు అంటుకు పోయింది. అక్కడి వాళ్లకు నా యందు కొంచెంకూడా ఆసక్తి లేకుండా పోయింది. వారు నన్ను మరిచిపోయారు. అందుచేత నేను ఒకరోజు వాళ్ల భవనం నుంచి తప్పించుకుని దీవికి అడ్డంపడి నడవ సాగాను. దారిలో నాకు నా మిత్రులను తోలుకుపోతున్న నల్లటివాళ్లు తటస్థపడ్డారు. నేను చెట్లచాటున దాక్కొని వారి కంటపడకుండా తప్పించుకున్నాను.

నేనా రాత్రి అంతా ఆగకుండా నడిచాను. నరభక్షకులనుంచి తప్పించుకుపోవాలనే ఆదుర్దాలో నాకు నిద్రకూడా రాలేదు. దారివెంబడి కందమూలాలు తింటూ, ఎడతెగకుండా ఆరు రాత్రులూ,





ఆరు పగళ్లూ నడక సాగించి చివరకు నాలాటి మానవులుండే దేశం ఒకటి చేరాను. అది దీవికి అవతలి తీరంవద్ద ఉన్నది. వారు నా భాషే మాట్లాడుతూ నన్ను చుట్టుముట్టారు. నే నాభాష విని ఎంతో కాలమయింది. నేను వారితో నా కష్టాలన్నీ చెప్పుకున్నాను. ప్రాణాలతో బయటపడ్డందుకు నన్ను అభినందించి నాకు అన్నపానాదులు అమర్చారు. ఒక గంటసేపు విశ్రాంతి తీసుకున్నాక వారు నన్ను తమ పడవలలో ఎక్కించుకుని తమ రాజువద్దకు తీసుకు పోయారు. ఆ రాజుగారు మరొక దీవిలో ఉంటున్నాడు.

రాజధానిలో జనసమ్మర్దం హెచ్చుగా ఉంది. అంగళ్లలో సమస్తమైన సరుకులూ ఉన్నాయి. వీధులు విశాలంగా నిర్మలంగా ఉన్నాయి. ఈ వీధులవెంట అనేకమంది మేలుజాతి గుర్రాలమీద జీను లేకుండా సవారీఅయి అటూ ఇటూ వెళుతున్నారు. నేను రాజుగారిని దర్శనంచేసుకుంటూనే, "మీ దేశంలో రౌతులు జీనులేకుండా గుర్రాలమీద సవారీఅయి వెళుతున్నారు, కారణమేమిటి? సవారీకి జీనులుండటం మరింత సుఖంకాదా?" అని అడిగాను.

"జీనులేమిటి? వాటిని మేమెన్నడూ చూడనేలేదే?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.



"అలా అయితే, అనుమతి ఇవ్వండి, నేను ఒకటి రెండురోజుల్లో జీను తయారు చేసి ఇస్తాను. దానిలో ఉండే సౌకర్యం మీకే తెలిసివస్తుంది," అన్నాను.

రాజు సరే నన్నాడు. పనిమంతుడైన వడ్రంగి నొకణ్ణి పట్టుకుని, దగ్గిర ఉండి వాడిచేత కొయ్యజీను తయారుచేయించాను. తరవాత దానికి ఈకలు కూరిన మెత్త ఒకటి కుట్టించి, దానికి తోలుతొడుగూ, జలతారు అంచులూ, రంగురంగుల కుచ్చులూ ఏర్పాటుచేయించాను. తరవాత ఒక కమ్మరి వద్దకు వెళ్ళి, కళ్ళెం తగిలించే ఇనపముక్క చేయించాను, రెండు రికాబులు చేయించాను. నేను వాడి గొంతుమీద కూచోవటం వల్ల నాకు కావలిసిన విధంగా వాటిని తయారుచేసి ఇచ్చాడు.

అన్నీ చక్కగా అమరినాక నేను అశ్వశాలకు వెళ్ళి అక్కడ ఉన్న గుర్రాలలో ఉత్తమమైన దాన్ని ఏరి, దానికి జీనూ, కళ్ళాలూ తగిలించాను. దాని మెడకు నీలం కుచ్చులు అమర్చాను. తరవాత దాన్ని తీసుకుపోయి రాజుగారి ముందుంచాను. రాజుగారు గుర్రం ఎక్కి జీనులోగల సౌకర్యాలు, గుర్రాన్ని నడపటంలో కొత్తగా వచ్చిన సులువూ తెలుసుకుని నాకు అంతులేని ధనమూ, బహుమతులూ ఇచ్చాడు.



తరవాత మంత్రిగారు నన్ను పిలిచి తన గుర్రానికికూడా అటువంటి జీను తయారు చేయించమని అడిగారు. నేను ఆయన కోరికకూడా తీర్చాను. అదిమొదలు ఆ దేశంలో ఉన్న పెద్దపెద్దవాళ్లంతా నాచేత జీనులు తయారుచేయించుకుని నాకు అపరిమితమైన డబ్బు ఇచ్చారు. నేను దేశంలో కల్లా ధనికుణ్ణి అయిపోయాను!

రాజుగారికీ నాకూ గాఢమైన స్నేహం ఏర్పడింది. ఒకనాడాయన నాతో, "చూడు, సింద్‌బాద్! నువు నాకు ఆప్తులందరిలోకీ ఆప్తుడివైపోయావు. నువు పరదేశీయుడివనే భావంకూడా నాలో కలగటంలేదు. అందుచేత నా కోరిక ఒకటి తీర్చగలవా?" అని ఆప్యాయంగా అడిగాడు.

"ఏలినవారు అనటమూ, నేను కాదనటమూనా? సెలవియ్యండి," అన్నాను.

"అయితే నువ్వొక అందమైన స్త్రీని పెళ్ళాడాలి. ఆమె ఉత్తమవంశాన పుట్టినది. చాలా ధనం కలది. ఆమెను వివాహం ఆడితే నువ్విక్కడే ఉండిపోతావని నా ఆశ. కాదనకు, సింద్‌బాద్!" అన్నాడు రాజుగారు.

నా కేమనాలో తోచలేదు. నా బుర్రంతా పాడయిపోయి నట్టయింది. నే నాయన కేసి చూడలేక తల వంచుకున్నాను.

"మాట్లాడ వేమోయ్?" అన్నాడు రాజుగారు.

"మహారాజా, నేను తమ సేవకుణ్ణి. తమ యిష్టప్రకారం చెయ్యండి," అన్నాను.

వెంటనే ఆయన పధువునూ, కాదీనీ సాక్షులనూ పిలిపించి నా వివాహం జరిపించేశాడు. ఆమె అందగత్తె మాత్రమేకాక చాలా సంపన్నురాలు. ఆమెకు అనేకమైన భవనాలూ, వస్తువాహనాలూ, భూములూ ఉన్నాయి. రాజుగారు మేం ఉండటానికి ఒక దివ్యమైన భవనమూ, అనేకమంది నౌకర్లూ, చాకర్లూ, ఆడ మగ బానిసలూ బహూకరించాడు. (ఇంకా వుంది)






# నావికుడు సింద్‌బాద్

చాలా నెలలపాటు నాకు జీవితం సుఖంగా గడిచింది. నేనూ నా భార్యా అన్యోన్యంగా ఉండేవాళ్లం. అందుచేత నేను రహస్యంగా బాగ్దాదుకు పారిపోయేటప్పుడు నా భార్యనుకూడా వెంటబెట్టుకు పోదామనుకున్నాను. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడన్నది ఎన్నటికీ అబద్ధంకాదు. నేను పగటికలలు కన్నానన్న విషయం త్వరలోనే స్పష్టమయింది.

ఒకనాడు నా పొరుగింటి పెద్దమనిషి భార్య చనిపోయింది. నే నాయనను పరామర్శించటానికి వెళ్లి, "అన్నా, విచారించకండి. విచారించి మనం చేయగలదికూడా ఏమీలేదు. ఈ వియోగాన్ని మీరు త్వరలోనే మరచిపోతారు. ఎవరు చూశారు? మీకు ఇంతకంటెకూడా యోగ్యురాలైన భార్య ఈసారి దొరకవచ్చు," అన్నాను.

నా మాటలు విని ఆయన ఆశ్చర్యపోయినట్టు కనపడ్డాడు. "కొద్దిగంటల్లో చచ్చిపోబోతున్నవాడికి ఇంకో భార్య ఏమిటి?" అన్నాడాయన.

ఈసారి ఆశ్చర్యపడటం నా వంతు. "అలా అంటున్నారేమిటి? ఎందుకు నిష్కారణంగా నిరాశపడిపోతున్నారు? అల్లా కటాక్షంవల్ల మీ ఆరోగ్యానికేమి

నాలుగవ సముద్రయానం

CHITRA





లోపంలేదే! కొంపతీసి, ఆత్మహత్యగాని తల పెట్టలేదుగద?" అన్నాను.

దాని కాయన, "మీకు మాదేశపు ఆచారాలు తెలివన్నమాట! మాదేశంలో భార్యా భర్తలలో ఎవరు చనిపోయినా, శవంవెంట రెండోవారినికూడా పూడ్చేస్తారు. అనాదిగా వస్తున్న ఈ ఆచారానికి అందరూ, రాజుగారు సయితం, బద్ధులే!" అన్నాడు.

"ఛీ ఛీ! ఇదేం ఆచారం! నా బొందెలో ఊపిరి ఉండగా ఇలాటి ఆచారాన్ని నేను ఆమోదించను," అన్నాను.

మేము మాట్లాడుతుండగానే ఆయన బంధువు లంతా వచ్చి, ఆయన భార్య చచ్చినందుకూ, ఆయన చావబోతున్నందుకూ తమ సంతాపాన్ని వెలిబుచ్చారు. తరవాత ఉత్తరక్రియలకు ఏర్పాట్లు జరిగాయి. ఆయన భార్య శవాన్ని చక్కగా అలంకరించి, ఆమె కుండిన ఖరీదైన నగలన్నీ పెట్టి శ్మశానానికి బయలుదేర దీశారు. శవపేటిక వెనక భర్త నడిచాడు. అతని వెనకగా బంధువులూ, ఇతరులూ నడిచారు.

అంవరమూ నదీతీరాన గల ఒక కొండ వద్దకు వెళ్ళాం. ఆ కొండమీద ఒక చోట ఒక లోతైన బావిలాటిది ఉన్నది. దానిపై విశాలమైన బండరాతి పలక కప్పివున్నది. ఈ పలకను పక్కకు లాగి శవపేటికను







బావిలోకి దించారు. తరవాత నా స్నేహితుణ్ణి పట్టుకుని తాళ్ల సహాయంతో లోపలికి దించారు. ఆ తాడుకే ఒక నీళ్ల కూజా, ఏడు రొట్టెలూ కట్టారు. నా స్నేహితుడు కిందికి దిగటానికి కొంచెమైనా అసమ్మతి తెలపలేదు. తిరిగి రాతిని బావిమీదికి తోసేశారు. మేమందరమూ తిరిగి వచ్చేశాం.

నేనుకూడా ఈ ఘోరమైన ఆచారంలో పాల్గొన్నాను. నా మనస్సు చాలా బాధపడింది. ఇంతకన్న దారుణమైనది నేనెన్నడూ చూడలేదనిపించింది. రాజభవనం చేరుతూనే నేను రాజుగారిని చూసి, "అయ్యా, నేను చాలా దేశాలు చూశాను గాని, చచ్చిపోయిన భార్యతో బతికున్న భర్తను పాతిపెట్టటంలాంటి అమానుషమైన ఆచారం ఎక్కడా చూడలేదు. ఈ దురాచారం పరదేశీయులకుకూడా వర్తిస్తుందా, దయచేసి చెప్పండి!" అన్నాను.

"తప్పక వర్తిస్తుంది. భార్య పోతే ఇక్కడ ఉండే పరదేశీయుడుకూడా ఆ భార్యతో పోవలిసిందే!" అన్నాడు రాజు.

నా పొట్టలో ఎవరో చెయ్యిపెట్టి కెలికినట్టయింది. ఎంత ప్రయత్నించినా ఆగని గుండెదడతో నే నింటికి వెళ్ళి, నేను లేని సమయంలో నా భార్య చచ్చిపోయిందేమోనని ఆత్రంగా చూశాను. ఆమె పూర్తి ఆరోగ్యంతో ఉండటం చూడగానే నాలో నేను కాస్త ఊరటచెంది, "భయపడక, సింద్‌బాద్! నువే ముందు చస్తావు. నిన్ను బతికుండగా పూడ్చరులే!" అని ధైర్యం చెప్పుకున్నాను. కాని ఇది అడియాసగా పరిణమించింది. ఎందుకంటే తరవాత కొద్దికాలానికే నా భార్యకు జబ్బుచేసింది. ఆవిడ కొద్దిరోజులు మంచానపడి తీసుకుని చివరకు తన ఆత్మను అల్లాపరం చేసేసింది.

నా దుఃఖానికీ, భయానికీ అంతే లేదు. బతికుండగా పూడ్చిపెడితే ఏమయింది, నరభక్షకులు తినేస్తే ఏమయింది? రాజు








గారు వచ్చి నా చావుగురించి తన విచారం వెలిబుచ్చాక, ఆశ అంటూ ఏమన్నా మిగిలి ఉంటే అదికూడా అడుగంటింది. ఆయనకు నేనంటే ఎంత ప్రేమ! నన్ను సమాధి చేసేటప్పుడు తానూ, తన దివాణం అధికార్లూ స్వయంగా వస్తామని చెప్పాడు. నా భార్యను అలంకరించి సర్వాభరణభూషితురాలిని చేసి పెట్టెలో పెట్టి తీసుకువెళ్ళేటప్పుడు, పెట్టె వెనకగా నేను నడుస్తుంటే రాజుగారు నా వెంబటే నడిచాడు.

సముద్రతీరాన గల కొండవద్దకు చేరాం. బావిమీద ఉండే మూతను పక్కకు తోశారు. నా భార్య శవాన్ని లోపలికి దించారు. నాకు వీడ్కోలు చెప్పటానికి వచ్చినవారంతా నా చుట్టూ మూగారు. అప్పుడు నేను రాజుగారితో, "మీ దేశపు ఆచారానికి నన్ను గురిచెయ్యటం ఎంతమాత్రం భావ్యంకాదు. మా దేశంలో నాకు భార్య ఉన్నది, బిడ్డలున్నారు. వారు నాకోసం ఎదురుచూస్తున్నారు," అని వాపోయాను.

నా మాటలు ఒకరూ వినిపించుకోలేదు. నా చేతుల కిందుగా తాళ్లు దూర్చారు, ఆ తాళ్లకే నీటి కూజా, ఏడు రొట్టెలూ కట్టారు, నన్ను లోపలికి దించారు. "తాళ్లు ఊడదీసెయ్యి, పైకి లాక్కుంటాం!" అని వాళ్లు పైనుంచి కేకపెట్టారు. నేనా పని చెయ్యాక, నన్ను పైకి లాగమన్నట్టుగా తాళ్లు గుంజాను. వాళ్లు విసిగిపోయి తాళ్ళను లోపల పడేసి, బావి మూసి వెళ్ళిపోయారు.

లోపల ఒక విశాలమైన గుహలాగా ఉన్నది. పైనుంచి కొంత వెలుతురు వస్తూండటంవల్ల బొత్తిగా అంధకారంగా లేదు. నేను నేలమీద కూలబడి చాలాసేపు దుఃఖించి, "హాయిగా, ఇంటిపట్టున కూచోలేక వచ్చినందుకు నా గతి ఇంతే కావాలి! ఆ పడవ పగిలినప్పుడు సముద్రంలో మునిగి చచ్చానుకాను! నేనీ దిక్కు

మూలిన దేశంలో ఎందుకు పెళ్ళాడాలి? ఇలాటి చావు ఎందుకు చావాలి?" అనుకున్నాను.

కొంతసేపటికి ఆకలి దప్పులు ఆరంభమయాయి. నేను సాధ్యమైనంత కాలం ఆయుర్దాయం పొడిగించుకోవటానికి నిశ్చయించుకుని, రొట్టెలూ, నీళ్ళూ కొంచెం కొంచెంగా ఖర్చుచేయ సాగాను. రాత్రివేళ పడుకోవటానికి ఒక చోటు ఏర్పాటుచేసుకున్నాను. క్రమక్రమంగా నా నీరూ రొట్టెలూ అయిపోయాయి. ఇక చావుకోసం వేచివుండటం తప్ప నేను చేయకలిగినదేమీ లేదు. ఆ స్థితిలో ఒకసారి నాకు ఏదో చప్పుడు వినపడి నిద్రాభంగ మయింది. జాగ్రత్తగా వింటె ఎవరో శ్వాస పీల్చే చప్పుడు వినబడింది. తరవాత ఏదో జంతువు పారిపోతున్న చప్పుడయింది. నేను సాహసించి ఆ పారిపోయే ప్రాణిని వెంబడించాను. చాలా దూరం పడుతూ లేస్తూ, ఎక్కుతూ, దిగుతూ పోగా పోగా ఎదటగా ఒకే ఒక నక్షత్రం మిలమిలా మెరుస్తూ కనబడింది!

నా ఆశ్చర్యానికి మేరలేదు. అది గుహలోకి మరొక బావి అయివుండొచ్చు, దానిలోనుంచికూడా శవాలను పడేస్తారేమో ననుకున్నాను. కాని తీరా దగ్గరకు వెళ్ళేసరికి అది ఒక సన్నని బొరియలాగా వుంది.





శవాలను తినటానికి ఏ నక్కలో, తోడేళ్ళో ఆ బొరియను ఉపయోగిస్తూ ఉండాలి. దానిలోనుంచి దూరి నేను పైకి వచ్చేసరికి ఆకాశం నక్షత్రాలతో వెలిగిపోతున్నది. నా ఎదట సముద్రమూ, వెనక కొండా వున్నవి.

నేను అక్కడే మోకరించి భగవంతుడికి నా కృతజ్ఞత తెలుపుకున్నాను. తరవాత వచ్చిన దారినే మళ్ళీ శవాల గుహలోకి వెళ్ళి అక్కడి శవాలమీద గల నగలన్నిటినీ దోచి మూటగట్టి తీసుకువచ్చి సముద్ర తీరాన కొండ అడుగున భద్రంగా దాచాను.

దొరికిన ఆహారం తింటూ ఆ తీరానే కొన్ని రోజులు వేచిఉన్నమీదట ఒకనాడు నాకొక పడవ కనబడింది. నేను వెంటనే నా తలపాగా ఊడదీసి, దానిని గాలిలో ఎగిరేటట్టు పట్టుకుని తీరంవెంబడి అటూ, ఇటూ పరిగెత్తాను. అదృష్టవశాన పడవలోవాళ్ళు నన్ను గమనించారు. పడవను ఒడ్డుకు తెచ్చి నన్నూ, నా మూటలనూ అందులోకి ఎక్కించుకున్నారు.

పడవసరంగు నాదగ్గిరికి వచ్చి, "ఏమయ్యా, ఇన్నేళ్ళుగా, ఈ తీరం వెంబడి పడవ నడుపుతున్నాను, ఈ కొండ దిగువ ఎన్నడూ నరప్రాణి కనిపించిన పాపాన పోలేదే! నువ్విక్కడికెట్లా వచ్చావు?" అని అడిగాడు.



"ఏం చెప్పేది, బాబూ? ఒక పెద్ద ఓడలో అనేకమంది వర్తకులం ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చి ఓడ కాస్తా పగిలిపోయింది. నేనొక్కణ్ణే ప్రాణాలతో బయటపడ్డాను. అదృష్టవశాన నాకొక పెద్ద కొయ్యపలక దొరికింది, దానిమీద నా సరుకులు వేసుకుని, నేనుకూడా ఎక్కి ప్రాణాలు దక్కించుకుని ఇక్కడ వచ్చిపడ్డాను," అని చెప్పాను. నాకు పెళ్లి అయిందనీ, నాభార్య చచ్చిపోతే నన్నుకూడా పాతేశారనీ చెబితే ఆ దిక్కుమాలిన దేశంవాడెవడైనా పడవలో ఉండి వింటాడేమోనని నాకు భయంవేసి అబద్ధం చెప్పేశాను.

సరంగును మంచి చేసుకుందామనే ఉద్దేశంతో నేను, శ్మశానంనుంచి తెచ్చిన నగలలో మంచి వెలగలది ఒకటి తీసి, "ఉంచండి!" అని ఇవ్వబోయాను. కాని సరంగు దానిని నిరాకరిస్తూ, "వద్దు! ప్రయాణీకులవద్ద డబ్బు పుచ్చుకుంటాను గాని ప్రాణాపాయస్థితిలో కాపాడిన మనిషివద్ద డబ్బు పుచ్చుకునే ఆచారం లేదు. ఎంతోమందికి భోజనమూ, దుస్తులూ, దారిఖర్చులూకూడా ఎదురిచ్చాను. మనుషులు ఇతర మనుషులపట్ల మనుషుల్లే ప్రవర్తించటం ధర్మం!" అన్నాడు.

ఆ మనిషికిగల ధర్మబుద్ధి చూస్తే నాకు చాలా ఆనందం కలిగింది. మా ప్రయాణం చాలా సుఖంగా సాగింది. నేను గంటల తరబడి పడుకుని విశ్రాంతి తీసుకుంటూ నా అనుభవాలు జ్ఞాపకం తెచ్చుకునేవాణ్ణి. నే నెదుర్కున్న కష్టాలన్నీ కలలలాగా తోచేవి. నాభార్య శవంతో ఆ గుహలో ఉండటం జ్ఞాపకం వచ్చినప్పుడు ఒళ్ళు చల్లబడేది.

ఎలాగైతేనేం మా పడవ బస్రా చేరింది. అక్కడ కొద్ది రోజులుండి, నది వెంబడి బగ్దాదు చేరాను. నన్ను చూసీ, నేను తెచ్చిన సరుకు చూసీ, నా బంధు మిత్రాదులంతా పరమానంద భరితులైయ్యారు.



# నావికుడు సింద్‌బాద్

నేను చేసిన నాలుగు సముద్రయానాలూ నాకు అంతులేని లాభాలు చేకూర్చాయి. ఎన్ని కష్టాలు పడ్డా నాకు ఈ ప్రయాణాలు అచ్చిరాగలవనీ, విశేషమైన అనుభవం గడించగలననీ నాకు ధైర్యం కలిగింది. అందుచేత కొంతకాలం సమస్త వైభోగాలు అనుభవిస్తూ ఇంటిపట్టున గడిపిన అనంతరం నేను మళ్ళీ అయిదవ ప్రయాణానికి సిద్ధపడ్డాను.

ఇందుకై బజారుకు వెళ్లి, లాభసాటిగా అమ్మకమయే సరుకు కొని పేళ్ళు కట్టించి, దానితో బస్రా చేరాను. నేను బస్రారేవులో దిగే సమయానికి అక్కడ ఒక పెద్దనౌక, సరికొత్తది అమ్మకానికి సిద్ధంగా వుంది. దాన్ని చూడగానే నాకు చాలా ముచ్చటయింది. వెంటనే బేరంచేసి ఆ నౌకను కొనేశాను. తరవాత, మంచి అనుభవం గల సరంగునూ, సమర్థులైన కళాసులనూ జీతానికి ఏర్పాటుచేసుకుని, నా బానిసలచేత నా సరుకంతా నౌకలోకి పట్టించాను. ఈ బానిసలు ప్రయాణంలో నా వెంట ఉండటానికి ఇంటినుంచి తెచ్చుకున్నవాళ్లే. నేను బయలుదేరే లోపుగా కొందరు వర్తకులు నావెంట రాగోరి, ప్రయాణపు ఖర్చులు

అయిదవ సముద్రయానం

CHITRA







ముందుగానే వారిచ్చుకున్నారు. ఈసారి నౌక నాదే గనక, మా సరంగుకు నేను సరి అయిన సలహాలివ్వగల ననుకున్నాను. ఏమంటే ఇప్పటికి సముద్రయానంగురించి నాకు చాలా అనుభవం అయింది.

మేము బస్రానుంచి చాలా ఉత్సాహంగా బయలుదేరాం. గాలి అనుకూలంగా వుంది. సముద్రం ప్రశాంతంగా ఉంది. మా నౌక అనేక రేవులు తాకింది. ప్రతి రేవులోనూ క్రయవిక్రయాలు సక్రమంగా సాగాయి. చివరకు ఒకసారి మేము ఒక నిర్జనమైన దీవివద్ద లంగరు దించాం. వర్తకులందరూ దిగి దీవి చూడబోయారు. అక్కడ వారి కొక గండభేరుండపక్షి గుడ్డు కనిపించింది. అదేమిటో తెలియక వాళ్లు దానిపై రాళ్ళు విసిరారు. కొంతసేపటి కది చిట్లి అందులో నుంచి పిల్ల కాలు బయటికి వచ్చింది. అమాయకులైన వర్తకులు ఆ పిల్లను బయటికి లాగి, దాన్ని కోసి తలా ఒక ముక్క తీసుకుని నౌకకు తిరిగి వచ్చారు.

వారు చేసిన పనిగురించి వినగానే నాకు పట్టరాని భయం కలిగింది. "మీరు కొంప ముంచేశారు! ఆ పిల్లకోసం గండభేరుండ పక్షి దంపతులు త్వరలోనే వచ్చి, జరిగినది తెలుసుకుని, మనని హతమార్చేస్తాయి! చేతనైనంత వేగంగా పారిపోవటం తప్ప వేరే మార్గం లేదు," అంటూ తెరచాపలు ఎత్తించి, నౌకను సముద్రంవేపు పట్టించాను.

ఈ లోపల తాము తెచ్చుకున్న పక్షి ముక్కలు వండించుకున్నారు. కాని వారు వాటిని తినబోయే లోపలే ఆకాశాన సూర్యుడికి రెండు మేఘాలు అడ్డుతగిలినట్టయింది. అవి మమ్మల్ని సమీపిస్తుంటే, గండభేరుండ పక్షులని మాకు స్పష్టమయింది. వాటి రెక్కల చప్పుడూ, అరుపులూ వింటూంటే ఆకాశం గర్జిస్తున్నదని పించింది. అవి మా నౌకకు ఎగువను ఎత్తుగా ఎగురుతున్నప్పుడు వాటి గోళ్లలో రెండు బ్రహ్మాండమైన రాళ్లు,







మా నౌకలకంటె పెద్దవి, ఉన్నట్టు మాకు కనిపించింది. మా వర్తకులు తమకు చేసిన ద్రోహానికి అవి ఏ విధంగా పగ తీర్చుకో దలిచాయో నాకు బోధపడింది.

చూస్తుండగానే ఒక పక్షి తన గోళ్ల మధ్య ఉన్న రాతిని నేరుగా నౌకమీదికి వదిలింది. కాని మా సరంగు ఎంతో యుక్తిగా చుక్కాని పక్కకు తిప్పేసి నౌకను కాపాడాడు. ఆ రాయి మా పక్కనే పడింది. అది పడిన చోట నీటిలో ఎంత పెద్దగొయ్యి పడిందంటే మాకు సముద్రం అడుగు కనిపించింది. ఆ రాయిపాటుకు లేచిన అలల మూలంగా మా నౌక బెండు ఆడినట్టు ఆడిపోయింది.

ఇంతలోనే రెండోపక్షి రెండోరాయి పడేసింది. దాని దెబ్బకు నౌకలో సగంభాగం పప్పు పప్పు అయిపోయింది. రాతి దెబ్బకు పచ్చడి అయిపోగా మిగిలినవారంతా సముద్రంపాతపడ్డారు. నేను ప్రాణం దక్కించుకునేటందుకు విశ్వప్రయత్నాలు చేస్తూ అదృష్టవశాత్తూ ఒక కొయ్యముక్కను సంపాదించి దాని సహాయంతో తేలాను. దానిమీద ఎక్కి కాళ్లతో తెడ్డువేస్తూ, గాలి సహాయానా, అలల సహాయానా, కొన ప్రాణంతో ఒక దీవిమీద వెళ్లిపడ్డాను. ఒక గంటసేపు ఇసకలో పడుకున్నాక గుండె దడ కాస్త తగ్గింది, బలం కాస్త తిరిగి



వచ్చింది. అప్పుడు నేను లేచి దీవిని పరీక్షించటం ప్రారంభించాను.

అది నిజంగా భూలోకస్వర్గమే. ఎటు చూసినా చెట్లమీద పచ్చగా పండిన పళ్లున్నాయి. చెట్లమీద రంగురంగుల పక్షులు కలకల నాదాలు చేస్తున్నాయి. నేలపైన పూలమొక్కలు రంగుల తివాసీ పరిచినట్టుగా మనోహరంగా ఉండి, కమ్మని సువాసనలు వెదజల్లుతున్నాయి. నేను వృథా కాలయాపన చేయక వెంటనే పళ్లు కోసుకు తిని, నిర్మలమైన సెలయేటి నీరు తాగి, పువ్వుల పాన్పులాటి నేలపై పడుకుని విశ్రాంతి తీసుకున్నాను.

చీకటి పడే సమయానికి నాకు మెళుకువ వచ్చింది. నా పరిసరాలు మనోహరంగా ఉన్నాయని తెలిసినా, ఒంటరిగా ఆ దీవిలో ఉండటం మూలాన నాకు చాలా భయం కలిగింది. ఆ రాత్రల్లా నాకు సరిగా నిద్ర లేదు. నిద్రపోయినప్పుడు భయంకరమైన పీడకలలు వచ్చాయి. ఎలాగైతేనేం తెల్లవారింది, నాకు మనస్థిమితం కలిగింది. నేను లేచి దీవి యావత్తూ కలయ తిరగసాగాను.

త్వరలోనే నేనొక మడుగు దగ్గిరికి వచ్చాను. అందులోకి ఒక జలధార పడుతున్నది. మడుగు అంచున ఒక ముసలాడు కూచుని ఉన్నాడు. ఆకులు గుచ్చి ఒక





దుప్పటిలాగా చేసి దాన్ని కప్పుకుని ఉన్నాడు. "ఎవరో నావికుడు. ఓడ పగిలి పోతే ఒడ్డుచేరి ఉంటాడు," అనుకున్నాను.

నేను ముసలాణ్ణి సమీపించి పలకరించాను. ఆ ముసలాడు సంజ్ఞలతో మాత్రమే సమాధానం చెప్పాడు. "ఏం, మహానుభావా? మీరిక్కడికెలా వచ్చారు?" అని అడిగాను. ఆయన విచారంతో తల అడ్డంగా తిప్పి, తనను నా భుజాలమీద ఎక్కించుకుని ప్రవాహం దాటించమన్నట్టుగా సంజ్ఞలు చేశాడు. అవతలి గట్టున ఉన్న చెట్ల ఫలాలు తినాలని ఉన్నట్టు కూడా సూచించాడు.



ఈ ముసలాడికి ఉపకారంచేస్తే ఆ పుణ్యం ఊరికే పోదనిపించింది. నేను వంగి ఆయనను నా భుజాలమీద ఎక్కించుకున్నాను. ఆయన తన తొడలు నా కంఠం చుట్టూవేసి, కాళ్లు పెనవేసి నా రొమ్ముమీద పెట్టి, తన చేతులతో నా తల పట్టుకున్నాడు. నే నాయనను ప్రవాహం దాటించి ఆయన చూపిన చోట వంగి, "బాబూ, మెల్లిగా దిగండి!" అన్నాను. కాని ఆయన కదలలేదు. పైపెచ్చు తన తొడలతో నా కంఠాన్ని మరింత గట్టిగా నొక్కుతూ, నా భుజాల మీద మరింత బరువుగా కూచున్నాడు.

నాకు ఆశ్చర్యం వేసింది. నే నాయన కాళ్లకేసి మరింత పరీక్షగా చూతునుకదా, అవి నల్లగా, బొచ్చుతో, దున్నపోతు కాళ్లలాగున్నాయి. నా కేదో భయం పట్టుకుంది. ఆ మనిషిని కిందికి పడెయ్యాలని యత్నించాను. కాని ఆ మనిషి నా కంఠం మరింత గట్టిగా నొక్కాడు. నాకు ఊపిరాడలేదు. కళ్లు చీకటైపోయాయి. ఆయన్ని వదిలించుకోవటానికి మరొక తుదిప్రయత్నం చేసి ఆ తరవాత స్పృహతప్పి పడిపోయాను.

నాకు మళ్లీ స్పృహ తెలిసేసరికి ముసలాడింకా నా భుజాలమీదనే ఉన్నాడు. అయితే వాడి ధర్మాన కాళ్ళు కొంచెం









నదలించి, నాకు ఊపిరి అందేటట్టు మాత్రం చేశాడు. నాకు ఊపిరి అడుతూండటం గమనించగానే ముసలాడు నన్ను గుండెల్లో కాళ్లతో ఒక తన్నుతన్నాడు. నేను లేచి నిలబడ్డాను. తరవాత వాడు ముందుకు వంగి చెయ్యిచాచి, చెట్ల కిందుగా వెళ్లమని సంజ్ఞచేశాడు. నేనలాగే చేశాను. వాడు చెట్ల మీది పళ్లలో మంచివన్నీ ఏరి తాపీగా తిన సాగాడు. నేను తన కిష్టం లేనప్పుడు ఆగినా, తనకు కావలిసిన దానికంటె వేగంగా నడిచినా నా రొమ్ముల్లో తన్నుతూ తనకు కావలిసిన విధంగా నన్ను నడిపించాడు. ఆ రోజల్లా నేను వాణ్ణి పశువు మోసినట్టు మోశాను. ఆ రాత్రి పడుకున్నప్పుడుకూడా వాడు నా భుజాలమీదినుంచి దిగలేదు. తెల్లవారగానే నన్ను తన్ని లేపగొట్టాడు.

ఆ పగలూ, రాత్రికూడా నేను వాణ్ణి మోశాను. చేతులతో, కాళ్లతో తన్నుతూ వాడు తనకు కావలిసినట్టుగా నాచేత పని చేయించుకున్నాడు. ఈ ముసలాడి సేవలో నేను అనుభవించిన శరీరబాధగాని అవ మానంగాని నా జన్మలో నే నెన్నడూ పడిన వాణ్ణికాను. వాడి బలం యువకుల కుండదు. గాడిదలు కాసే వాళ్లుకూడా వాడంత దయా దాక్షిణ్యాలు లేకుండా ఉండరు. వాణ్ణి వదిలించుకునే దారేమో కనబడలేదు. "ఈ ముసలాడిమీద నా కెందుకు కనికరం కలగాలి? ఇంతకన్న చావు వచ్చినా బాగుండి పోనే!" అని విచా రిస్తూ వాడు తిప్పినట్టల్లా తిరిగాను.

ఇలా అనేక వారాలు గడిచాయి. ఒక నాడు నేను వాణ్ణి మోసుకు పోతూండగా కొన్ని చెట్ల కింద సొరపాదులు కనిపించాయి. వాటికి పెద్దపెద్ద సొరకాయలున్నాయి. వాటిల్లో పెద్దదిగా, ఎండుదిగా చూసి ఒకటి ఏరి, దాన్ని డొల్లచేసి, శుభ్రంచేసి, అందులోకి ద్రాక్షపళ్ల రసం పిండాను. తరవాత దాని మూతికి బిరడా పెట్టి ఎండలో పెట్టాను.





కొద్ది రోజులకల్లా అది పులిసి సారా అయింది. తరవాత అవకాశం దొరికినప్పుడా సార కాయ బుర్ర ఎత్తి అందులోనుంచి కొంత తాగాను. ఆ ద్రాక్షసారా తాగితే వచ్చిన ఉత్సాహంతో ఈ భుజంమీది బరువు మరింత సులువుగా మోయవచ్చునని నా ఆశ. నేను పరిమితంగా తాగటంచేత ఒళ్లు తెలియకుండా పోవటానికి బదులు ఉత్సాహం వచ్చింది. ఆ ఉత్సాహంలో నేను భుజం మీది బరువుతోనే అటూ ఇటూ గెంత సాగాను, పాడుతూ, నృత్యంచేస్తూ, నా నృత్యానికి నేనే ఆనందించి చప్పట్లు కొట్ట సాగాను. నా హర్షధ్వానాలతో చుట్టూ ఉన్న తోట అంతా మారుమోగి పోయింది.

ముసలాడు నాలో వచ్చిన బలాన్ని గమనించి, బుర్ర తనకుకూడా ఇమ్మని సంజ్ఞ చేశాడు. వాణ్ణి చూస్తే భయంవల్ల గాని, లేకపోతే ఇవ్వకనే పోదును. నే నిచ్చిన బుర్ర తీసుకుని ముందు కొద్దిగా ద్రాక్షరసం రుచి చూశాడు. తరవాత బుర్ర ఎత్తి లోపలి సారా అంతా తాగేసి, ఖాళీ బుర్రను దూరంగా చెట్లమధ్య విసిరి పారేశాడు.

త్వరలోనే వాడి బుర్ర తిరగసాగింది. వాడు నా భుజాలమీద నృత్యం చెయ్య సాగాడు. తరవాత నీరసించినట్టు కన బడ్డాడు. వాడి కండరాలలో పటుత్వం కాస్త పోయింది. భుజంమీద సరిగా కూచోలేక మైకంతో ఇటూ అటూ ఒరగసాగాడు.

నామీద వాడి పట్టు సడలటం గమనించి, నా మెడచుట్టూ పెనవేసి ఉన్న వాడి కాళ్లు విడదీసి, ఒక్క ఊపున వాడు అంత దూరం వెళ్లి పడేట్టు తోశాను. వాడు పడిన చోటే ఉండి పోయాడు. నేను తడువుకోకుండా చెట్ల మధ్య కనిపించిన లావుపాటి రాయి ఒకటి ఎత్తుకొచ్చి వాడి తల కాస్త చితక గొట్టేశాను. వాడు చచ్చాడు. నేను వాడి చెరనుంచి బయటపడ్డాను. అల్లా వాడి పట్ల కనికరిస్తాడనుకోను. (ఇంకా వుంది)



# నావికుడు సింద్‌బాద్

వాడి శవాన్ని చూస్తుంటే నా మనసుకూ, దేహానికి కూడా కొత్తబలం వచ్చినట్టయింది. నేను అతివేగంగా సముద్రతీరంకేసి పరిగెత్తాను. అదృష్టవశాత్తూ అక్కడ నాకు కొందరు నావికులూ, తీరాన లంగరు దించి ఉన్న వారి పడవా కనిపించాయి. వారు పళ్లకోసమూ, నీటికోసమూ లంగరువేశారు. వారు నన్ను చూసి ఆశ్చర్యపోతూ చుట్టూ మూగి, ప్రశ్నలవర్షం కురిపించారు. నేను నా అనుభవాలన్నీ చెప్పాను. ముసలివాడు నన్నెట్లా భూతమై పట్టాడో, వాణ్ణి ఎట్లా తుదముట్టించానో చెప్పేసరికి, "అమ్మో, ఆ ముసలాడి నుంచే తప్పించుకున్నావుగా! వాడు ఎందరినో తన కాళ్లతో నొక్కి చంపాడు. తప్పించుకొచ్చిన వాడివి నువ్వొక్కడివే! నీ అదృష్టం మంచిది," అన్నారు వాళ్లు.

వాళ్ళు నన్ను తమ పడవకు చేర్చారు. సరంగు నాకు కట్టుకోను బట్టలిచ్చాడు. అయనకూడా నా కథ విన్న తరవాత పడవ కదిలింది.

చాలా రోజులు ప్రయాణించేసి మేమొక పట్టణం రేవు చేరాం. అది చాలా పెద్దపట్టణమనీ అనేకదేశాల వర్తకులు అక్కడికి వచ్చిపోతూ వుంటారనీ, సరంగు

అయిదవ సముద్రయానం

CHITRA




నాతో చెప్పాడు. ఈ పట్టణం చుట్టూ ఉండే చెట్లపై కొండముచ్చులు జాస్తి అయినందు వల్ల ఈ పట్టణానికి కొండముచ్చుల పట్నం అని పేరు వచ్చిందనికూడా అతడు అన్నాడు.

ఊళ్లోకి వెళ్లితే ఏదైనా బతుకుతెరువు కనిపిస్తుందేమో ననిపించింది. అందుకని ఒక వర్తకుడితోసహా నేను పడవ దిగి నగరం లోకి బయలుదేరాను. నాకు మంచి స్నేహితుడైన ఆ వర్తకుడు నా చేతికొక సంచీ ఇచ్చి, "ఈ సంచీనిండా గులకరాళ్లు పోసుకుని, నగరద్వారంలోనుంచి మందలు మందలుగా బయటికి వచ్చే జనంతో చేరు. వాళ్లందరూ పట్టణానికి దిగువను వున్న లోయదగ్గిరికి పోతారు. అక్కడ వాళ్ళు ఏం చేస్తే నువ్వూ అదే చెయ్యి. నీకు గిట్టుబాటు కాకపోదు," అన్నాడు.

అతను చెప్పినట్టే నేను సంచీనిండా గులకరాళ్ళు పోసుకున్నాను. నగరద్వారం దగ్గిరికి వెళ్లేటప్పటికి ఒక మంద బయటికి వస్తూ కనిపించారు. అందరి చేతుల్లోనూ నా సంచీలాటివే ఉన్నాయి. నా మిత్రుడు వారికి నన్ను పరిచయం చేస్తూ, "ఇతను పేదవాడు, దూరదేశంవాడు, ఇతనికికూడా బతుకుతెరువు చూపించి పుణ్యం కట్టు కోండి!" అన్నాడు.

కొంతదూరం నడిచి అందరమూ ఒక లోతైన లోయసమీపానికి వచ్చాం. దాని నిండా చాలా ఎత్తయిన చెట్లున్నాయి. వాటిని ఎక్కటానికి మనుష్యమాత్రుడెవడూ సాహ సించలేడు. వాటిని కొబ్బరిచెట్లంటారట! వాటి మట్టల్లో కొండముచ్చులూ, కొబ్బరి కాయలూ ఉన్నాయి.

మేమందరమూ చెట్లకింద ఆగాం. మిగి లినవాళ్ళు సంచులు నేలమీద పెట్టి కొంత ముచ్చులను గులకరాళ్ళతో కొట్టసాగారు. నేనూ అలాగే చేశాను. కొండముచ్చులకు కోపం వచ్చి, కొబ్బరికాయలతో కొట్ట సాగాయి. మేమందరమూ ఆ కొబ్బరి







కాయలను ఏరుకుని సంచులలో వేసుకున్నాం. సంచులు నిండగానే వాటిని భుజాలమీద వేసుకుని నగరంలోకి వెళ్ళాం. అక్కడ నా మిత్రుడైన వర్తకుడు నేను తెచ్చిన కాయలను తీసుకుని వాటి ఖరీదు నా కిచ్చేశాడు. ఈ విధంగా నేను రోజూ ఆ లోయకు వెళ్లి కొబ్బరికాయలు తెచ్చి అమ్మి, కొంత డబ్బు పోగయాక దాన్ని పెట్టుబడిచేసి క్రయవిక్రయాలు చేసి, చిట్ట చివరకు ముత్యాలదీవికి వెళ్ళటానికి కేవుకు సరిపడే మొత్తం సంపాదించాను.

ఈ ప్రయాణంలో నావెంట బోలెడన్ని కొబ్బరికాయలు తీసుకుపోయాను. దారిలోని దీవులలో వాటిని విక్రయించి మిరియాలూ, లవంగపట్టా మారకానికి తీసుకున్నాను. ముత్యాలదీవి చేరే లోపుగా ఈ సరుకంతా లాభసాటిగా అమ్మాను. అక్కడ ముత్యపు చిప్పలు ఏరేవాళ్ళను నియోగించటానికి నాదగ్గిర డబ్బున్నది.

నాకు అదృష్టం బాగా కలిసిరావటంవల్ల నా ముత్యపుచిప్పల్లో మంచి ముత్యాలు దొరికాయి. వాటిని అక్కడ వున్న వర్తకులకు మంచి ధరకు అమ్మాను. ఆ విధంగా త్వరలోనే నేను పెద్ద నిధి సంపాదించగలిగాను. ఇక ఇంటిమీద ధ్యాస పుట్టింది. తిరుగు ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకున్నాను. ప్రయాణంలో చేరవలసిన రేవుల్లో అమ్మేందుకు సరుకులు కొనటం మంచిదనిపించింది. అందుచేత ఆ దీవులలో విరివిగా దొరికే ముసాంబరం చెక్క కొని, పడవమీద సరుకంతా వేసుకుని, దారిలో విక్రయిస్తూ, బస్రా మీదుగా బాగ్దాద్ చేరుకున్నాను.

నేను తిరిగివచ్చానని నా బంధుమిత్రులంతా సంతోషించారు. నేనుకూడా లాభంతో తిరిగివచ్చాను గనక పేదసాదలకు దానధర్మాలు చేసి, యథాప్రకారం భోగభాగ్యాలలో తులతూగ సాగాను.





# నావికుడు సింద్‌బాద్

కొంతకాలం గడిచింది. ఒక సాయంకాలం చల్లగాలి అనుభవిస్తూ ఇంటిముందు కూచుని ఆనందిస్తూండగా వీధివెంబడి కొంతమంది వర్తకులు వచ్చారు. వారిని చూడగానే దూరదేశాలనుంచి తిరిగివస్తున్నారని స్పష్టమైంది. చాలాకాలం తరవాత మాతృదేశాన్ని చూస్తున్న కారణంచేత వాళ్ళ కళ్ళలో ఆనందం తొణికిసలాడుతున్నది. ఆ ఆనందం దేశంలోనే ఉండిపోయినవాడు అనుభవించలేడు. నాకు మళ్లీ దేశాటనమీద మనసు పోయింది. నేను వెంటనే వర్తకానికి అనువైన సరుకులు విరివిగా కొని వాటితో బస్రా చేరాను. అక్కడ ఒక పెద్ద ఓడ ప్రయాణానికి సిద్ధంగా ఉంది. ఓడలో నాలాంటి వర్తకులూ, రాజప్రయాణీకులూ ఉన్నారు. నా సరుకులుకూడా ఆ ఓడలో వేయించి, అందులో ఎక్కి బయలుదేరాను.

కొత్త కొత్త విశేషాలు చూసి ఆనందిస్తూ, సరుకులు అమ్ముతూ, కొంటూ ఒక దేశంనుంచి మరొక దేశానికీ, ఒక నగరంనుంచి మరొక నగరానికీ ప్రయాణం సాగించాం. కాని ఒకరోజు మేమందరమూ ఓడపైన నిశ్చింతగా విశ్రాంతి తీసుకుంటున్న

ఆరవ సముద్రయానం

CHITRA







సమయంలో, మా సరంగు పెద్దపెట్టున ఆర్త నాదాలు చేస్తూ తన తలపాగా విసిరి కింద కొట్టి, ముఖం బాదుకోవటమూ, గడ్డం పీక్కోవటమూ చేశాడు.

మేమంతా ఆయనచుట్టూ మూగి ఏమి టేమిటని అడిగాం. "నాయనలారా, తెలుసుకోండి! మనం దారితప్పి తెలియని సముద్రంలో ప్రవేశించాం. మనని రక్షించే భారం ఇక అల్లాదే! అందరూ అల్లాను ప్రార్థించండి!" అన్నాడు సరంగు.

ఈ మాట అంటూ ఆయన, తెరచాప లను సరిచెయ్యటానికి స్తంభం ఎక్కాడు. ఇంతలోనే భయంకరమైన గాలి ఒకటి సాగింది. దాని తాకిడికి చుక్కాని తునా తునకలై పోయింది. సరంగు స్తంభం దిగి వచ్చి, "అల్లాను మించిన శక్తి లేదు! విధి బలాన్ని ఎవరూ అడ్డగించ లేరు! స్నేహి తులారా, యీ క్షణాన మన ఆటకట్టయి పోయింది!" అన్నాడు.

ప్రయాణీకులందరూ గగ్గోలుపెట్టి ఒకరి కొకరు వీడ్కోలు చెప్పసాగారు. ఇంతలోనే గాలికి ఓడ ఒక పర్వతాన్ని ఢీకొని అప్పడం నలిగినట్టు నలిగిపోయింది. ప్రయాణీకులు కొందరు నీటిలో మునిగిపోయారు. కొందరం యీదుకుంటూ, అక్కడక్కడ నీళ్లమధ్య ఉన్న రాళ్ళను చేరుకుని అప్పటికి ప్రాణాలు దక్కించుకున్నాం.

ఈ పర్వతం ఒక పెద్ద లంక అంచున ఉండి సముద్రంలోకి పొడుచుకు వచ్చింది. లంక వెంబడి తీరంనిండా పగిలిపోయిన ఓడల శిథిలాలున్నాయి. వాటితాలూకు సరుకుల బేళ్లు పడిఉన్నాయి. ఆ బేళ్ళలో నుంచి ఖరీదైన సరుకులూ, నగలూకూడా బయటికి వచ్చిఉన్నాయి. వీటిమధ్యా మేము తీరం చేరాం.

నేను కొంత దూరం నడిచి ఒక కొండ వాగు వద్దకు చేరాను. ఈ వాగు సము ద్రంలో పడటానికి మారుగా ఒక కొండ







పగులులోనుంచి బయలుదేరి లంకలోపలికి ప్రవహిస్తూ కొంతదూరం వెళ్ళి ఒక గుహలో దూరింది. ఈ వాగు రెండు గట్టులా కెంపులూ, ఇతర రంగుల రాళ్ళూ, వజ్రాలూ, వెండీ, బంగారు కణికలూ ఉన్నాయి. వాగులోపలకూడా గులకరాళ్లకు బదులు అమూల్యమైన రత్నాలుండి ధగధగా ప్రకాశిస్తున్నాయి. ఆ ప్రాంతాల వెదజల్లి ఉన్న సంపదను మనుష్యమాత్రు డెవడూ ఎన్నడూ కళ్ళజూసి ఉండడు. ఆ దృశ్యం కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ ఉంది. వాగువెంబడి మేలురకం ముసాంబరం చెట్లున్నాయి.



ఇవన్నీ గాక ఈ లంకలో విచిత్రమైన ప్రవాహం ఒకటి ఉన్నది. అది నీటి ప్రవాహం కాదు. కొండలమీద ఉండే అంబరు ఎండవేడికి కరిగి నల్లని తారులాగా అయి ప్రవాహంకట్టి సముద్రంలోకి పారుతుంది. సముద్రపు చేపలు ఈ అంబరు ద్రవాన్ని ఆత్రంగా తాగేస్తాయి. కొంత సేపయాక అది వాటి కడుపులో ఇమడక వాంతి అయిపోతుంది. అది నీటిమీద తేలి రంగు మారి, గట్టిపడి తృణమణి అయి ఒడ్డుకు కొట్టుకు వస్తుంది. అంబరుప్రవాహం మూలానా, తృణమణి మూలానా ఈ లంక అంతటా చక్కని సువాసనలున్నాయి.

ఇంత సంపదా ఇక్కడ ఉండికూడా మానవుడికి దీన్ని అనుభవించే గీత లేదు. ఎందుకంటే ఈ ప్రాంతాలకు వచ్చిన నావ భగ్నం అయితీరవలసిందే తప్ప తిరిగి పోయే ఆశ లేదు. అందుచేత ప్రాణాలతో ఈ లంకను చేరిన మేము ఈ సంపదమధ్య దిక్కులేని దరిద్రులమై పోయాము. ఎన్నో విందులు చెయ్యటానికి సరిపడే మూల్యం ఉండికూడా మేము ఆకలికి అలమటించవలసి వచ్చింది. మా దగ్గిర ఉన్న కొద్ది ఆహారాన్ని ఎంతో న్యాయంగా పంచుకున్నాం. అయితే నాలాగా ఉపవాసాలకు






అలవాటు పడని నా అనుచరులు తమ ఆహారాన్ని ఒకటి రెండు పూటలలో తినేసి, కొద్ది రోజులకల్లా ఆకలికి మాడి ఒక్కొక్కరుగా చావసాగారు. నేను వాళ్లకు చేయగల సాయం ఏమీలేదు. నా వంతు ఆహారాన్ని మాత్రం పొదుపుగా కొంచెం కొంచెమే, అది కూడా రోజుకు ఒకసారే, తింటూవచ్చాను.

బతికున్నవాళ్లం చచ్చిపోయిన వారిని సముద్రతీరాన ఇసకలో పాతేశాం. శవాలకు కప్పటానికి తగిన బట్టలు అక్కడ బోలెడున్నాయి. ఈ బాధలన్నిటికీ తోడు సముద్రంమీదినుంచి ఒక గాలి వీచి అందరికీ రోగాలు తెప్పించింది. నేను తప్ప చావకుండా మిగిలిన వారంతా ఈ రోగాలపాల పడ్డారు. చివరకు చచ్చినవాణ్ణి పూడ్చేసి, నేను ఒంటరిగా ఆ లంకలో మిగిలాను.

ఎంత పొదుపుగా తింటేనేం? నా ఆహారం కూడా అయిపోవచ్చింది. "ఇప్పుడు నేను చస్తే నా శవానికి స్నానం చేయించి పాతిపెట్టేవాళ్లు కూడా లేరే! నేనే ముందుగా ఎందుకు పోయానుగాను?" అని విచారించాను. నాకోసం నేనొక గొయ్యికూడా తవ్వుకున్నాను. అవసానకాలం సమీపించినప్పుడు నేనా గోతిలో పడుకుంటే వాయుదేవుడే నన్ను పూడ్చుకపోతాడా అని నా



ఉద్దేశం. నా విరక్తి చెప్పటానికి లేదు. "ఒరే, సిందబాద్! అయిదుసార్లు చావు తప్పి కన్ను లొట్టపోయినా నీకు జ్ఞానం రాలేదు. దాలిగుంటలో పడుకున్న కుక్కలాగా నువు మళ్లీ మొదటికి వస్తూనే ఉంటావు. ఎందుకు నీకీ ధనదాహం? నీ కున్నదంతా ఖర్చుచేస్తూ తిన్నా మూడు తరాలకు సరిపోనే!" అని నన్ను నేను తిట్టుకున్నాను.

కాని ఈ పశ్చాత్తాపం వెనకే ఒక ఆలోచన వచ్చింది. ఆ గుహలో దూరిన ప్రవాహం మాటేమిటి? అది కొండ అవతల బయటికి వచ్చి ఉండాలి. ఆ ప్రవాహం ఎక్కడికి





పోతుంది? అక్కడ ఏమున్నది? ఇక్కడ దిక్కుమాలిన చావు చచ్చేకన్న ఆ ప్రవాహం సంగతి తేల్చుకునే ప్రయత్నంలో చావటం ఎంతో మేలు కాదా?

ఈ ఆలోచనతో నాకు కాస్త ఉత్సాహం వచ్చింది. నేను ముసాంబరం కొమ్మలు కొన్ని పెద్దవిగా చూసి పోగుచేసి వాటిని కలిపి కట్టి ఒక తెప్ప తయారుచేశాను. దానిమీద పగిలిపోయిన ఓడల చెక్కలు పరిచాను. కనిపించినంతలో పెద్ద పెద్ద మణులూ, తృణమణులూ ఏరి మూటలు కట్టి తెప్పమీద ఎత్తుగా పోగుచేశాను. తరవాత నాదగ్గిర మిగిలివున్న ఆహారంతోసహా తెప్పమీద ఎక్కి, రెండు చెక్కలు తెడ్లుగా ఉపయోగిస్తూ, వేగంగా ప్రవహిస్తున్న వాగు మీద ప్రయాణమైనాను.

నా తెప్ప వాగువెంబడి పోయి పోయి, వాగుతోబాటే కొండగుహలో దూరింది. లోపల గాఢాంధకారం. వాగు ఎన్ని మెలికలు తిరిగితే తెప్పకూడా అతివేగంగా అన్ని మెలికలూ తిరుగుతూ పక్కన ఉన్న రాతికి కొట్టుకుంటున్నది. అప్పుడప్పుడూ నా తల రాతికప్పుకు కొట్టుకుంటున్నది. చూసి తప్పుకుందామా అంటే ఆ గుహ్వారంలో కన్ను పొడుచుకున్నా కనిపించటం లేదు. "ఈ అంధకారకూపంలో కెందుకు ప్రవేశించానురా, దేవుడా? ఇంతకన్న ఆ ఇసకలో చచ్చిపోయినా బాగుండేదే!" అనుకున్నాను. కాని వెనక్కు పోయే మార్గం లేదు. వాగు పల్లానికి దిగుతున్నకొద్దీ దాని దూకుడు హెచ్చుతున్నది. నేను పట్టుకున్న తెడ్లు కేవలం నిరుపయోగమయాయి. అందుచేత వాటిని వదిలేసి, తెప్పను కరుచుకుని బోర్లా పడుకున్నాను. లేకపోతే నా తల పగిలిపోయేటట్టు కనిపించింది. అట్లా పడుకున్నవాణ్ణి స్పృహ తప్పిపోయిన వాడిలాగా నిద్రపోయినాను.

(ఇంకా వుంది)



# నావికుడు సింద్‌బాద్

దాన్ని నిద్ర అనండి, మూర్ఛ అనండి, అది ఒక సంవత్సరంపాటు సాగిందనిపించింది. నాకు మళ్లీ స్పృహ తెలిసేటప్పటికి ఎండా వెలుగూ కనిపించాయి. నేనొక విశాలమైన పచ్చిక మైదానంలో పడుకుని ఉన్నాను. నా తెప్ప ఒక నది ఒడ్డున కట్టిపెట్టి ఉన్నది. నా చుట్టూ మందగా మూగి అనేకమంది ఇతియోపియనులున్నారు.

నేను మేలుకున్నానని తెలియగానే వాళ్లు మాట్లాడనారంభించారు. కాని నాకు వారి భాష రానందున ఏమీ బదులు చెప్పలేక పోయాను. ఇంతలో ఒక మనిషి ముందుకువచ్చి, స్వచ్ఛమైన అరబ్బీ భాషలో, "మీరెవరు? ఎక్కడినుండి వచ్చారు? మా దేశానికి ఏం పనిమీద వచ్చారు? మేము రైతులం. మా పొలాలకు నీరుపెట్టుకునే టందుకు వచ్చి, తెప్పమీద నిద్రపోతూ మీరు నదిమీద వస్తూండటం చూశాం. మేము దాన్ని ఆపి, ఒడ్డున కట్టేసి, మిమ్మల్ని తెచ్చి ఇక్కడ పడుకోబెట్టాం. మీ అంతట మీరు లేచేదాకా మేము లేపదలచ లేదు. అసలు మీ రిక్కడికి ఎట్లా వచ్చారో తెలియజేయండి," అన్నాడు.

ఆరవ సముద్రయానం

CHITRA





'ముందు ఇంత అన్నం పెట్టండి. తరవాత మీరు కోరేదల్లా చెబుతాను,' అన్నాను.

వెంటనే వాళ్లు నాకు కడుపునిండా తిండి పెట్టారు. నాకు పోతున్న ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. నేను వారికి నా కథ యావత్తూ చెప్పాను. నా కథ విని వాళ్లం దరూ ఆశ్చర్యంగా మాట్లాడుకోసాగారు. నా మాటలు వారికి తర్జుమాచేసి చెప్పిన వాడే వాళ్లమాటలుకూడా నాకు చెప్పాడు. నన్ను తీసుకుపోయి తమ రాజుగారికి చూపి, ఆయనకు నా చిత్రమైన కథ వినిపింతామని వారనుకున్నారట. నేను దానికి సంతో షంగా అంగీకరించాను. తెప్పను ధనపు మూటలతో సహా మోస్తూ వాళ్లు నన్ను రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

రాజుగారు నాకు ఆదరంతో స్వాగత మిచ్చాడు. ఆయన కోరినమీదట నా కథ యావత్తూ ఆయనకు పూసగుచ్చినట్టు చెప్పాను. నేను ప్రాణాలతో బయటపడి నందుకాయన నన్ను చాలా అభినందిం చాడు. నేను నా సంచులు విప్పి, నా కష్టా లకు ఎలాటి ఫలితం లభించినదీ చూపాను.

నేను తెచ్చిన రత్నాలూ, తృణమణులూ మొదలైనవి చూసి రాజుగారు ఎంతో మెచ్చుకున్నాడు. ఆయన గొప్ప రత్న నిపు ణుడు. నేనాయనకు రకానికి ఒక మణి చొప్పున తీసి బహుమతిగా ఇచ్చాను. ఇందుకు ప్రతిఫలంగా ఆయన నాకు చాలా మర్యాదలు చేసి, నన్ను తన రాజభవనంలో అతిథిగా ఉంచుకున్నాడు. ఆ విధంగా నేను రాజుగారి స్నేహమూ, ఇతర సామం తుల స్నేహమూ, సంపాదించ గలిగాను.

వారందరూ నాదేశం గురించీ, బగ్దాద్ పరిపాలన గురించీ అనేక ప్రశ్నలడిగారు. నేను మా ఖలీఫా హారూన్ అల్ రషీద్ గురించి గొప్పగా చెప్పాను. అంతా విని రాజు గారు, "మీ ఖలీఫా చాలా యోగ్యుడని స్పష్ట మవుతున్నది. ఆయన పట్ల నాకు





గొప్ప స్నేహభావం కలిగింది. అందుచేత నీ ద్వారా ఆయనకు తగిన బహుమతి పంపుదా మనుకుంటున్నాను!" అన్నాడు.

"అలాగే ఇవ్వండి. తప్పక ఆయనకు అందజేస్తాను. అంతే కాదు. మీరు చాలా యోగ్యులనీ, స్నేహపాత్రులనీ ఆయనతో స్నేహసంబంధం చేసుకోగలరనీకూడా చెబుతాను," అన్నాను.

వెంటనే రాజుగారు, తాను ఖలీఫాకు పంపదలచిన బహుమతులు తెప్పించాడు. వాటిలో ఒకటి కెంపురాయిలో మలిచిన కూజా. అది వేలిమందాన ఉండి అర అడుగు ఎత్తున్నది. దాని నిండా పోకకాయల ప్రమాణం గల ముత్యాలున్నాయి. మరొక బహుమతి ఒక పెద్ద తివాసీ, అచ్చుగా పాము చర్మంతో చేసినది. ఆ తివాసీలో గల విశేష మేమంటే దానిమీద రోగిష్టివాళ్లు పడుకుంటే వారికి ఆరోగ్యం చేకూరుతుంది. ఇంకొక బహుమతి, రెండు వందల హారతి కర్పూరపు ఉండలు. మిగిలిన బహుమానాలు, రెండు బ్రహ్మాండమైన ఐరావత దంతాలూ, పైనుంచి కిందికి నగలు దిగవేసి అలంకరించిన అందమైన దాసీదీనూ.

ఖలీఫాకు ఇమ్మని ఒక ఉత్తరం ఇస్తూ రాజుగారు, "ఇంత స్వల్ప బహుమానాలు



పంపుతున్నందుకు మీ ఖలీఫాను నా క్షమాపణలు అందజెయ్యి. నే నాయనను ఎంత మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానో ఆయనతో చెప్పు... కాని సింద్‌బాద్, నువిక్కడే ఉండిపోతే నేనింకా ఎంతో సంతోషిస్తాను. నీకు యావజ్జీవం ఏలోపం జరగనివ్వను. మీ ఖలీఫాకు ఈ బహుమానాలు మరెవరి ద్వారానైనా పంపుతాను. ఉండిపోతా వేమిటి? చెప్పు!" అన్నాడు.

"నన్ను మన్నించండి, మహారాజా! త్వరలోనే బస్రాకు ఓడ బయలుదేరుతున్నది. నా దేశాన్నీ, నా పిల్లలనూ, నా వారినీ చూడాలని చాలా ఆత్రంగా ఉంది.





నన్ను వెళ్ళనివ్వండి. మీ మేలు ఎన్నటికీ మరవను!" అన్నాను.

నన్ను బలవంతాన ఉంచెయ్యాలన్న ఉద్దేశం ఆయనకు లేదు. అందుచేత ఆయన ఓడ సరంగునూ, ఆ ఓడలో ప్రయాణిస్తున్న వర్తకులనూ రావించి, వారికి నన్ను వప్పగిస్తూ వెయ్యి హెచ్చరికలు చేసి, నా రేవు ఖర్చులు తానే ఇచ్చి, నాకు అంతు లేని బహుమానాలు అంటగట్టాడు. అవన్నీ ఇప్పటికీ నా వద్దనే ఉన్నాయి.

నేను రాజుగారివద్దా, ఇతర మిత్రుల వద్దా సెలవు తీసుకుని ఓడ యెక్కి, అల్లా కరుణవల్ల, నేరుగా బస్రా చేరి అక్కడి నుండి బగ్దాదుకు వచ్చేశాను. ఓడ దిగుతూనే నేను రాజభవనానికి వెళ్ళి ఖలీఫా దర్శనం చేసుకుని, ఆయనకు ప్రణామాలు చేసి. రాజుగారిచ్చిన ఉత్తరం అందించాను.

ఖలీఫా నేను తెచ్చిన ఉత్తరం చదువుకుని బహుమతులు పరీక్షించి, "ఇవి పంపిన రాజు నిజంగా కనిపించినంత ధనికుడేనా?" అని అడిగాడు.

"ప్రభూ, అందు కేమీ సందేహం లేదు. ఆయన ధనవంతుడే గాక న్యాయపరుడు, దక్షత గల పరిపాలకుడు. ఆయన కింద ప్రజలు ఎంత సుఖపడుతున్నారంటే రాజుకూ ప్రజలకూ మధ్య ఏ విధమైన పొరపూ పొచ్చెరమూ లేదు. ఆయన నిజంగా మనకు స్నేహపాత్రుడు, నమ్మదగినవాడు," అని జవాబిచ్చాను.

ఖలీఫా నాకు అనేక బహుమానాలూ, అధికారాలూ ఇచ్చి తన దర్బారు లేఖకులను పిలిపించి నా అనుభవాలన్నీ రాయించాడు. నా కథను ఇతిహాస పత్రాలలో చేర్చమని ఉత్తరు విచ్చాడు.

తరవాత నేను ఇంటికి వెళ్ళి నా వారిని కలుసుకుని, ఎంతో గౌరవ మర్యాదలు అనుభవిస్తూ, ఏ లోటూ లేకుండా సుఖంగా కాలం వెళ్ళబుచ్చ సాగాను.





# నావికుడు సింద్‌బాద్

ఇక నేను సముద్రయానాలు చేయ దలచలేదు. నాకు వయసు మైనబడుతున్నది. ఇంటి పట్టున ఉండా లనిపిస్తున్నది తప్ప, ఏళ్ల తరబడి దేశంకాని దేశాలలో ఉండటానికి మనసు ఇష్టపడటం లేదు. ఒక జన్మకి పడదగినన్ని కష్టాలు పడ్డాను, ఇక చాలు. బాగ్దాద్ నగరంలో నాకంటె ధనికుడు లేడు. ఖలీఫా నన్ను అప్పుడప్పుడూ పిలిపించి నా అనుభవాలు వింటూండే వాడు.

ఒకనాడు ఇలాగే హరున్ అల్ రషీద్ నన్ను పిలి పించాడు. నేను నా సముద్రయానాల కథలు చెప్ప టానికి సిద్ధ మవుతుండగా, ఆయన నాతో, "సింద్‌బాద్, ఆ ఇథియోపియా రాజుకు నేను సమాధానం రాశాను. ఆయనకు కొన్ని కానుకలుకూడా సిద్ధం చేశాను. వీటిని నీవే ఆయనకు చేర్చాలి. అక్కడికి దారి నీకు తెలిసినట్టు మరొకరికి తెలీదు. అదీగాక, నిన్ను మళ్లీ చూసి ఆయన చాలా సంతోషిస్తాడుకూడా. నువు ఇవాళే ప్రయాణం కావలసి ఉంటుంది. మన జవాబుకోసం ఆ రాజును వేచిఉంచటం భావ్యం కాదు," అన్నాడు.

51

ఏడవ సముద్రయానం

CHITRA





నాకు కళ్లు మసకలైనట్టయింది. కంగారులో పడిపోయాను. కాని ఖలీఫాకు కోపం వచ్చిపోతుందని నా భావాలను అణిచిపెట్టుకుని, ప్రయాణానికి సిద్ధంగా ఉన్నానని చెప్పాను. ఆయన నాకు దారిబత్తెంకింద పదివేల దీనారాలిచ్చాడు. తాను స్వయంగా ఇథియోపియా రాజుకు రాసిన జాబూ, ఆయనకు అందజేయవలసిన బహుమానాలూ నా పరం చేశాడు. వీటిలో ఒక ఎర్ర మఖ్మల్ పరుపూ, మరి రెండు వేరే రంగుల మెత్తలూ, నూరు తానుల సిల్కూ, తెల్ల కురువింద రత్నాలతో మలిచిన ఒక కూజా, మేలైన అరబ్బీగుర్రాలూ వున్నాయి.

ఏమాత్రమూ ఇష్టం లేకుండానే నేను బగ్దాదునుంచి బయలుదేరి బస్రా వెళ్లి అక్కడ ఒక నౌక పట్టుకున్నాను. రెండు మాసాలపాటు సముద్రయానంచేసి ఇథియోపియా రాజుండే దీవి చేరాను. ఖలీఫా ఇచ్చిన జాబూ, బహుమతులూ ఆయనకు అందజేశాను. ఆ రాజు ఖలీఫా ఔదార్యాన్ని ఎంతగానో మెచ్చుకుని, నన్ను చాలాకాలం అక్కడే ఉండిపొమ్మని నిర్బంధించాడు. నేను కొద్దిరోజులుమాత్రమే ఉండి, తరవాత ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, ఆయన మళ్లీ ఇచ్చిన బహుమానాలతో మళ్లీ నౌకలో ఎక్కి బస్రాకు బయలుదేరాను.

గాలి అనుకూలంగా ఉండటంచేత తిరుగుప్రయాణం సుఖంగా సాగింది. దారిలో సిన్‌దీవిలో వర్తకులు క్రయవిక్రయాలు చేశారు. ఆ దీవిని వదిలిన వారం రోజుల అనంతరం ఒకనాడు పెద్దవాన సాగింది. మా సరకుల బేళ్లు తడిసిపోతాయని వాటిపై కాన్వాసు కప్పి ప్రయాణీకులం అందరం అల్లాను స్మరించాం.

ఈలోపల సరంగు తెరచాప స్తంభం ఎక్కి చాలాసేపు అన్నివేపులా పరికించి చూశాడు. ఆయన కిందికి దిగి వచ్చే సరికి ఆయన ముఖం పాలిపోయి ఉంది.





ఆయన మాకేసి నిర్జీవంగా చూసి, నిశ్శబ్దంగా గడ్డం పీక్కోసాగాడు. మేమంతా ఆయన దగ్గిరికి పరిగెత్తి, "ఏమిటేమిటి ?" అని అడిగాం.

"అల్లాను ప్రార్థించండి. మనని ఉద్ధరిస్తే ఆయనే ఉద్ధరించాలి. లేదా ఒక్కొకరం పెట్టి అప్పగింతలు చెప్పుకోండి. ఎందుకంటే, మనం దోవ తప్పి, ఇంతవరకు ఎవరూరాని, మారుమూల సముద్రంలో వచ్చిపడ్డాం," అన్నాడు సరంగు.

తరవాత ఆయన తన సంచిలోనుంచి డబ్బితీసి పొడుము పీల్చి, ఒక పుస్తకం తీసి అందులో చూసి, "ఆహా ! నేను అనుకున్నంతా అయింది. ఆ కనిపించే తీరం చాలా ప్రమాదకరమైనది. ఆ తీరాన భయంకరమైన జంతువులూ, ఘోరసర్పాలూ ఉంటాయి. సముద్రంలో నౌకలను మింగజాలినంత పెద్ద తిమింగలాలుంటాయి. మీ అందరికీ ఉన్న విషయం చెప్పేశాను. ఇక సెలవు!" అన్నాడు.

ఆయన ముగించాడో లేదో మా నౌక ఇంత ఎత్తు ఎగిరి మళ్లీ నీటిమీద పడింది. మా గుండెలు ఆగిపోయినట్టయింది. సముద్రమంతా తెర్లుతున్నట్టు కనిపించింది. దీనికి కారణం మూడు తిమింగలాలు ! అవి కొండల్లాగా ఉన్నాయి. మా నౌకను తరుముతూ వస్తున్నాయి. వాటిలోకల్లా పెద్దది తన నోటిని కొండలోయలాగా తెరిచి మా నౌకను అందుకున్నది. నౌక దాని నోట పడేలోపుగా నేను సముద్రంలోకి గెంతేశాను. నేను నీటిలోపడిన మరుక్షణం ఆ తిమింగలం నౌకను మింగేసింది. ఆ తరవాత మూడు తిమింగలాలూ నీటిలో మునిగి తమదారిన తాము వెళ్లిపోయాయి.

ఆ తిమింగలం నౌకను కొరికినప్పుడు బయటపడిన ఒక చెక్కమీదికి ఎగబాకి, సముద్రంలో చాలాసేపు అటూ ఇటూ కొట్టుకుని చివరకు ఒకలంకమీదికి వచ్చిపడ్డాను.









ఆ లంకలో ఫలవృక్షాలున్నాయి. వేగంగా ప్రవహించే ఒక నదికూడా కనిపించింది. ప్రయాణానికి ఈ నదిని ఉపయోగించు కుందామనుకున్నాను. ఎందుచేతనంటే రత్నాలదీవినుంచి నన్ను రక్షించినది నదే. ఈ నది నన్ను రక్షిస్తే సరేసరి, లేకపోతే ఇంతటితో నా కష్టాలన్నీ ఈడేరుతాయి, ఇదే ఆఖరు ప్రయాణమవుతుంది. ఇలా అను కుని కొన్ని పళ్లు కోసుకు తిని ఒక చెట్టు కొమ్మలు పోగుచేసి తెప్ప తయారు చేసు కున్నాను. అది అసలైన అగరుచందనం చెట్టు అని నా కప్పట్లో తెలియదు. కొమ్మలను కలిపి కట్టటానికి తాళ్లయినా లేవు. బలమైన లతలు తెంపుకొచ్చి వాటితో తెప్ప తయారు చేశాను. దానిమీద పళ్లు పోగుచేసుకున్నాను. నేను తెప్పమీద ఎక్కి-ఒడ్డునుంచి తోశానో లేదో అది బాణంలాగా ప్రవాహాన పడి పరి గెత్తసాగింది. ఆ వేగానికి నేను తల తిరిగి పళ్లకుప్పమీద పడిపోయాను.

కొంతదూరం వెళ్లేసరికి నాకు ఎడతెగని పెద్ద హోరు వినిపించసాగింది. నది నురు గులు గక్కుతూ ప్రవహిస్తున్నది. దానివేగం చెప్పతరంకాదు. ముందుకు చూస్తే కొంత దూరాన నది అకస్మాత్తుగా అయిపోయినట్టు కనబడింది. అక్కడ ఒక పెద్ద జలపాతం ఉన్నట్టూ, నాకు వినపడే హోరు దానిదే





అయినట్టూ, నా తెప్ప శరవేగంతో ఆ జలపాతాన్ని సమీపిస్తున్నట్టూ వెంటనే నేను గ్రహించ గలిగాను.

నాకు అయువు మూడింది. జలపాతం వెంట పడేటప్పుడు నా శరీరం చితికి పోవటం కళ్లారా చూడటానికి మనసొప్పక, తెప్పను గట్టిగా వాటేసుకుని, కళ్లు మూసుకుని పడుకున్నాను. ఆఖరు క్షణంలో నా మనసు భగవంతుడిమీద లగ్నమై ఉంది.

నా తెప్ప జలపాతం అంచుకు వచ్చి ఒరిగిందికూడానూ. ఆ సమయంలో అకస్మాత్కంగా అది కదలటం మానేసి అలాగే ఉండి పోయింది. నేను విస్మయంతో కళ్లు తెరిచిచూద్దును కదా, ఒక పెద్ద వలలో నేనూ, నా తెప్పా చిక్కి ఉన్నాం. దాన్ని మా మీదికి విసిరినవాళ్లు ఒడ్డున ఉన్నారు. వాళ్లు వలను లాక్కుని నన్నూ, నా తెప్పనూ ఒడ్డుకు చేర్చారు.

నేను కొనప్రాణంతో, చలికి వణుకుతూ ఒడ్డున పడుకుని ఉన్నాను. తెల్లటి గడ్డం గల ఒక వృద్ధుడు నన్ను దయగా పలకరించి, నా మీద వెచ్చని బట్టలు కప్పాడు. అయన నా శరీరమంతా మర్దన చేశాడు. అయన చేసిన ఉపచర్యలతో నాకు మళ్లీ కొత్త బలం వచ్చింది. నేను లేచి కూర్చున్నాను. కాని నా నోట మాట రాకుండా





ఉంది. ముసలాడు నన్ను పట్టుకుని స్నానశాలకు నడిపించుకుపోయి, అక్కడ చక్కగా స్నానం చేయించాడు, నా వంటికి సుగంధ తైలాలు మర్దన చేయించాడు, తరవాత నన్ను తన ఇంటికి తీసుకుపోయాడు. ఇంటివాళ్ళంతా నన్ను ఎంతో స్నేహభావంతో చూశారు. కూర్చోవటానికి మంచి ఆసనం ఇచ్చి, తృప్తిగా భోజనం పెట్టారు. తరవాత ఆ గృహస్థు నాకొక గది చూపి, నాకేమైనా కావలిస్తే చూడటానికి కొందరు బానిసలను ఉంచి, తన పనిమీద తాను వెళ్ళాడు. ఈ విధంగా మూడురోజులు గడిచాయి. నన్ను ముసలివాడు గాని ఇతరులుగాని ఒక్క ప్రశ్నకూడా అడగలేదు. ఈ మూడు రోజులలోనూ నేను మళ్ళీ ఎప్పటి మనిషి నయాను.

నాలుగోరోజున వృద్ధుడు నాదగ్గిరికివచ్చి, "మీకు ఏ లోపమూ కలగటం లేదుగద. అల్లా అనుగ్రహంవల్ల నే నా సమయానికి అక్కడ ఉండి మిమ్మల్ని ఆపదనుంచి కాపాడగలిగాను...ఇంతకూ మీ రెవరు? ఎక్కడినుండి వస్తున్నారు?" అన్నాడు.

నేనాయనకు కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుని నా కథ యావత్తూ చెప్పాను. నేను వర్తకుణ్ణనీ, చాలాసార్లు సముద్రయానాలు చేశాననీ చెప్పాను. ఆయన ఒక గంటసేపు నే చెప్పినదంతా విని, "అయితే నా మాట విని, మీ సరుకు వెంటనే అమ్మెయ్యండి. ఎందుకంటే అది చాలా మేలు రకమైనది. ఇక్కడ దానికి మంచి గిరాకీ కూడా ఉంటుంది!" అన్నాడు.

ఈ మాటలు విని నేను నిర్ఘాంతపోయాను. ఆయన ఏ విషయం మాట్లాడుతున్నదీ నాకు తెలియలేదు. ఎందుకంటే నేను కట్టుబట్టలతో వచ్చిపడ్డాను. నా వెంట సరుకేమీ లేదు. అయినా నే నా మాట వెంటనే పైకి అనెయ్యక, "అలాగే చూదాం లెండి!" అన్నాను.







"మళ్ళీ ఆలస్య మెందుకు? మనం ఇప్పుడే బజారుకు వెళ్లి సరుకు అమ్మేద్దాం. మంచి ధరవస్తే సరేసరి, లేకపోతే సరుకును నా గిడ్డంగినుంచి కదిలించనే వద్దు," అన్నాడాయన.

"మీ యిష్టం, బాబుగారూ. నేను మీ చేతిలోవాణ్ణి. మీ రెలాచేస్తే బాగుంటుందని తోస్తే అలాగే చేసెయ్యండి. నాతో చెప్పవలసిన అవసరంకూడా లేదు," అన్నాను, లోపల ఆశ్చర్యపడుతూనే.

తరవాత ఇద్దరమూ కలిసి బజారుకు వెళ్లాం. మేమక్కడికి వెళ్లాక, నా ఆశ్చర్యం చూసి తీరాలి. అక్కడ నా తెప్ప ఉన్నది. దాన్ని దళార్లూ, వర్తకులూ పరీక్షిస్తున్నారు. "యా అల్లా! అద్భుతమైన చందనం! నేనెన్నడూ ఇంత మంచిది చూసి ఉండలేదు!" అనే మాటలు వినపడుతున్నాయి. నా సరుకు ఏమిటో నాకు తెలిసి వచ్చింది. నేను పైకి గుంభనగా ఉండిపోయాను.

వృద్ధుడి అనుమతితో వేలంపాట ప్రారంభమయింది. మొదటి పిలుపు వెయ్యి దీనారాలు. వృద్ధుడు రెండు వేలన్నాడు. ఇంకెవరో మూడు వేలన్నారు. పాట పది వేలదాకా పెరిగాక వేలం వేసేవాడు నాకేసి తిరిగి, "పదివేలకు కొట్టెయ్యమంటారా?" అని అడిగాడు. నేను వల్లకాదన్నాను.

అప్పుడు వృద్ధుడు నాకేసి తిరిగి, "బాబూ, ఇంతకంటె ధర పెగలదు. అసలే వ్యాపారం ఇప్పుడు అంతంతమాత్రంగా ఉంది. కావాలంటే మరొక వందచేసి నేనే సరుకు తీసుకుంటాను," అన్నాడు.

"బాబుగారూ, మీరే తీసుకునేట్టుంటే తప్పక తీసుకోండి. నే కాదంటానా?" అన్నాను. వృద్ధుడు నా తెప్పను తన బానిసలచేత గిడ్డంగికి పంపేశాడు. మే మిద్దరమూ ఇంటికి వచ్చేశాం. ఆయన నాకు పదివేల ఒక వంద దీనారాలూ ఒక ఇనప పెట్టెలో పెట్టి ఇచ్చాడు. (ఇంకా వుంది)






# నావికుడు సింద్‌బాద్

తరవాత మే మిద్దరమూ సరదాగా కబుర్లు చెప్పు కుంటూ భోజనంచేశాం. అప్పుడు వృద్ధుడు నాతో, "బాబూ, నాకు మగపిల్లలు లేరు. ఒకతే ఆడపిల్ల ఉంది. నా ఆస్తి కంతకూ అదే వారసురాలు. నాకు బోలెడంత వర్తకమే గాక, ఈ ఊళ్లో అనేక పదవులు కూడా ఉన్నాయి. నువు నా కూతుర్ని వివాహం చేసుకున్నావంటే నా ఆస్తీ, నా పదవులూ నీకే దక్కుతాయి. నువు సుఖంగా ఉండవచ్చు. ఏమంటావు? నా కూతుర్ని పెళ్లాడి ఇక్కడే ఉండిపోవటం సమ్మతమేనా?" అని అడిగారు.

నేను తల వంచి ఏమీ జవాబు చెప్పలేదు.

"పోనీ కనీసం నా జీవితాంతం వరకూ నైనా ఇక్కడే ఉండిపో. ఆ తరవాత నీ భార్యతోసహా మీ దేశం వెళ్లిపోదువుగాని!" అన్నారు వృద్ధుడు.

"బాబుగారు, మీ మాట ఎలా కాదనేది?" అని జవాబిచ్చాను.

వృద్ధుడు వెంటనే కాజీని పిలిపించి, సాక్షుల సమక్షాన నాకూ తన కుమార్తెకూ వివాహం చేసేశాడు. గొప్ప విందు జరిగింది. అప్పుడే నేను నా భార్యను

ఏడవ సముద్రయానం

CHITRA



మొదటిసారి చూశాను. ఆమె చాలా ఆకర్ష వంతమైనదేగాక, ఆమె వంటిన వేసకువేలు దీనారాల ఖరీదుచేసే నగలూ, దుస్తులూ ఉన్నాయి. మేమిద్దరమూ చాలాకాలంపాటు అన్యోన్యంగా కాపరం చేశాం.

చివరకు నా మామగారు చనిపోయాడు. ఆయన ఉత్తరక్రియలు వైభవంగా జరిపాం. ఆయన ఆస్తీ, బానిసలూ నాకు సంక్ర మించారు. నగరంలో ఉండే వర్తకులంతా నా మామగారి స్థానంలో నన్నే తమ పెద్దను గావించారు. అందుచేత నేను అక్కడి ఆచార నియమాలను మరింత శ్రద్ధగా పాటించవలసి వచ్చింది.

ఏటా వసంతఋతువులో ఈ నగరంలో ఒక చిత్రమైన ఘటన జరుగుతుందని నాకు తెలియవచ్చింది. ఒక రోజల్లా ఇక్కడి పురుషులకు రెక్కలు ఏర్పడ తాయిట. వారు వాటి సహాయంతో ఆకాశం లోకి ఎగిరిపోయి, అవి ఉన్నంతవరకూ దిగి రారు. ఈ రెక్కలు స్త్రీలకూ, పిల్లలకూ మొలవవు. అందుచేత వారుమాత్రం నగరం లోనే ఉండిపోతారు. ఇది మొదట నా చెవు లకు విడ్డూరంగా వినిపించింది. కాని కాల క్రమాన పరిపాటి అయిపోయింది. అయితే కాలక్రమాన ఒకందుకు నేను విచారించ సాగాను—ఈ నగరంలో ఏడాది కొకసారి



రెక్కలు మొలవని మగవాణ్ణి నేనొకణ్ణే! మిగిలిన మగవాళ్లంతా ఆకాశంలోకి ఎగిరి పోగా ఆడవాళ్లతో, పిల్లలతోబాటు నేనుకూడా నగరంలో ఉండిపోయేవాణ్ణి. ఇది చూసి సిగ్గేసి, రెక్కలు ఎలా వస్తాయని ఎందరినో అడిగాను, కాని ఒకరూ చెప్పలేదు. వారికి చెప్పటం ఇష్టం లేదో, లేక ఆ రహస్యం వారికే తెలీదో! నాకుమాత్రం ఇదొక తీరని విచారమైపోయింది.

ఆ నగరంలో ఒక వర్తకుడు ఉన్నాడు. అతను నాకు అనేక విధాల రుణపడి ఉన్నాడు. ఒకనా డతనితో నేను రహస్యంగా, "ఏమోయ్, ఈసారి నువ్వు ఎగిరేటప్పుడు నేను నిన్ను వాటేసుకుంటాను. నన్నుకూడా పైకి తీసుకుపో. ఇన్ని సముద్ర యానాలు చేశాను గాని, గాలిప్రయాణం ఎన్నడూ చెయ్యలేదు. నాకు ఈ ఉపకారం నువ్వు చేసి తీరాలి!" అన్నాను. మొదట అతను ఒప్పుకోలేదు, కాని కొంత ఊబ్బేసి నాక సరేనన్నాడు. నేను పరమానందంతో ఈ సంగతి నా భార్యకు చెప్పి, అతను ఎగిరిపోయేటప్పుడు అతని నడుము వాటేసుకున్నాను. ఇద్దరమూ గాలిలోకి ఎగిరాం.

మేము సూటిగా ఆకాశంలోకి వెళ్లిపోయాం. కొంతసేపయాక నాకు స్వర్గం సమీపంలో ఉన్నట్టూ, అక్కడి గంధర్వ







గానం వినిపించినట్టు తోచింది. నేను వెంటనే, "అల్లా! ఏమి నీ మహిమ!" అన్నాను. ఈ మాటలు నా నోట వచ్చాయో లేదో, మరుక్షణమే నన్ను పైకి తీసుకు పోయిన వర్తకుడు నాతోసహా రాయి పడ్డట్టు కింద పడసాగాడు. మే మిద్దరమూ కింద పడి చితికిపోతామని నాకు భయం వేసింది. కాని అదృష్టవశాత్తూ మేమొక కొండ శిఖ రాన దిగాం. రెక్కలు గలవాడు నాకేసి ఒక విపపు చూపు చూసి నన్నక్కడే వది లేసి తాను ఎటో ఎగిరిపోయాడు.

నేను విచారంగా ఒక రాయిమీద కూచుని, "నిజంగా నాది ఎటువంటి జన్మ! ఒక ఆపద గడిచీ గడవకుండానే మరొకటి ఎదురవుతున్నది!" అనుకున్నాను. ఈ చిక్కులోనుంచి బయటపడే మార్గమేమిటా అని నేను ఆలోచిస్తూ ఉన్నంతలో ఇద్దరు అపురూప సౌందర్యం గల కుర్రాళ్లు నాకేసి వచ్చారు, వారిద్దరి చేతిలోనూ బంగారు బెత్తాలున్నాయి.

నేను ఆత్రంగా లేచి వారికి ఎదురువెళ్లి, "నాయనలారా, మిమ్మల్ని అల్లా కాపాడతాడు! ఎవరు మీరు? ఇక్కడ ఏం చేస్తున్నారు?" అన్నాను.

వారిలో ఒకడు తన బంగారు బెత్తం నా చేతి కిచ్చి, ఒకవేపు వేలు చూపి, తరవాత రెండోవాడితో చెయ్యీ, చెయ్యీ కలిపి, ఎటో వెళ్లిపోయాడు. వారు వెళ్లగానే నేను, వారిలో ఒకడు చూపినవేపు నడవసాగాను. ఒక రాయి మలుపు తిరిగేసరికి నాకొక పెద్ద సర్పం కనిపించింది. అది ఒక మనిషిని అప్పుడే రొమ్ముదాకా మింగేసింది. ఆ మనిషి నన్ను చూసి, "రక్షించండి, బాబూ! రక్షించండి!" అని అరిచాడు. నేను వెనకగా వెళ్లి ఆ సర్పం మెడమీద బంగారు బెత్తంతో గురిగా ఒక్కదెబ్బ కొట్టేసరికి ఆ సర్పం చచ్చింది. తరవాత దాని నోటినుంచి ఆ మనిషిని బయటికి లాగేశాను.











తీరా పరికించి చూస్తే ఆ మనిషి నన్ను ఆకాశంలోకి ఎత్తుకుపోయినవాడే. వాడితో "ఏం, బాబూ? స్నేహితుడిపట్ల అలాగేనా ప్రవర్తించవలసింది?" అన్నాను.

"అయ్యా, నా ప్రాణం కాపాడారు, మీకు ఎంతో కృతజ్ఞుణ్ణి! కాని ముందుగా మీకొక సంగతి చెప్పాలి. నేను ఆకాశంనుంచి కింద పడిపోవటానికి కారణం మీరు స్మరించిన పేరే! ఆ పేరు మేమెవరమూ స్మరించం. అది చెవిన పడితే మా శక్తులు కాస్తా పోతాయి," అన్నాడా మనిషి.

"ఆ సంగతి నేనెరగను. నీకు పుణ్యం ఉంటుంది, నన్ను ఇల్లు చేర్చు. నేనా పేరు ఉచ్చరించనులే!" అన్నాను. నన్నతను వీపున ఎక్కించుకుని క్షణంలో మా మిద్దె మీద చేర్చాడు.

నా భార్య నన్ను మళ్లీ చూసి చాలా సంతోషించింది. "మనం ఈ మనుషుల మధ్య ఉండటం మంచిదికాదు. వీళ్లంతా పిశాచ గణాలకు పుట్టినవాళ్లు," అన్నది. అల్లా పేరుకూడా వినలేకపోవటంబట్టి ఆమె అన్నది నిజమేనని గ్రహించి, "అయితే మరి మీనాన్నకూడా వీళ్లతోటివాడేగా?" అన్నాను.

"మా నాన్న వీళ్లలోవాడు కాడు. వీళ్ల ఆచారాలెప్పుడూ ఆయన పాటించలేదు, వీళ్లు చేసే పనులేవీ చెయ్యలేదు. ఆయన పోయాడు గనక మనం ఈ దిక్కుమాలిన ఊళ్లో యిక కాపరం ఉండనవసరం లేదు. ఇల్లూ, వాకిలీ తెగనమ్ముకుని వెళ్లిపోదాం," అని నా భార్య అన్నది.

ఉన్న ఆస్తి అంతా వీలయినంత హెచ్చు ధరలకు అమ్మేసి పుష్కలంగా డబ్బు చేసుకుని, బగ్దాదు వెళ్లి అక్కడ మా యింట, నా బంధువులమధ్య ఉండాలని నా భార్య కోరిక. ఆ ప్రకారమే నేను, నా వ్యాపారదక్షత యావత్తూ వినియోగించి, మా మామ సంపాదించిన ఆస్తి యావత్తూ ఎంతో లాభానికి అమ్మి, ఆ సొమ్ముతో





ఒక ఓడా, కొంత వ్యాపార సరకూ కొన్నాను. ఆ ఓడలో నేనూ నా భార్యా ఎక్కి, దారి వెంబడి క్రయవిక్రయాలు చేసి లాభాలు సంపాదిస్తూ కాలక్రమాన బస్రా చేరాం. అక్కడినుంచి బగ్దాదు వెళ్లాం.

నేను నా భార్యతో సహా మా యింటికి వెళ్లాను. మమ్మల్ని చూసి అందరూ ఎంతో ఆనందించారు. నేను నా వ్యవహారాలన్నీ సరిచూసుకుని, నావెంట తెచ్చిన సరుకులు దుకాణాలలో పెట్టించి, బంధు మిత్రులందరి మధ్యా కూచుని నా ప్రయాణం విషయా లన్నీ చెప్పాను. ఇక ఎన్నడూ బగ్దాదు విడిచి దూరదేశాలకు పోనని వాళ్ల ఎదట ప్రమాణంకూడా చేశాను. ఆ ప్రమాణాన్ని ఈనాటివరకూ తప్పలేదు.

## ఉపసంహారం

సింద్‌బాద్ నావికుడు తన కథ ముగించాక కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. అతను మూటలు మోసే సింద్‌బాద్‌వేపు తిరిగి, "నాయనా, ఈ ధనం సంపాదించటానికి నే నెన్ని అగచాట్లుపడ్డానో, చూశావా? మూటలు మోస్తూ జీవితం గడిపిన నువ్వు నాకంటె భద్రంగా బతకలేదా? నిజం చెప్పు? నువ్వు పేదవాడివిగా ఉండిపోయావనీ, నేను అపార ధనవంతుడి నయాననీ ఒప్పుకుంటాను. కాని భగవంతుడు మనం చేసిన ప్రయత్నాలనుబట్టి మనకు ఫలితాలిచ్చాడు," అన్నాడు.

బరువులు మోసేవాడు సింద్‌బాద్‌కు ప్రణామం చేసి, "అయ్యా, నేను అజ్ఞానంలో పాడిన ఆ పదాలను పట్టించుకోకండి!" అన్నాడు.

నావికుడు సింద్‌బాద్ నెల రోజులపాటు తన అతిథులకు విందులు చేసి, అనంతరం బరువులు మోసేవాణ్ణి తన కొలువులో చేర్చుకున్నాడు. వారు జీవితాంతంవరకూ మిత్రులుగా ఉండి సుఖంగా జీవించారు.

(అయిపోయింది)

